మాటవరస (2) 1931

మాటవరస (3) 1933

మాటవరస (4) 1934 భూకంపం

పేపరుమిల్లు

విమానంమీద వస్తు

మాటవరస (5) 1937

మాటవరస (6) 1938

మాటవరస (7) 1943

[మాటవరస (1)—1930

రాజమండ్రీ

ఆర్ట్సు కాలేజీలో

22—3—1930 తారీఖున

పూర్వ విద్యార్థి సంఘ వార్షికోత్సవ సందర్భములో

శ్రీ నిడమర్తి జలదుర్గా

ప్రసాదరాయుడు గారి

అధ్యక్షత క్రింద జరి

గిన సభలో చదివినది.]

## చుట్టా, బీడీ, సిగరెట్.

చుట్టా, బీడీ, సిగరెట్లు త్రిమూర్తులని చెప్పవచ్చు. వీటికి జన్మస్థానం అమెరికా అని విఖ్యాతమైన పొగాకు. ఈ మూడింట్లో నేనూ, పొగాకు, అనేకమైన ఇతర ఆకారాల్లో, భూమిమీద. కర్మవశంచేత, అవతారాలు ఎత్తి ఉండి; తను నాశనం అయిపోయి ప్రపంచాన్ని నడిపిస్తోంది. పొగాకు ఇతరులకోసం తగులడిపోతోంది. అదే, చుట్టా, బీడీ, సిగరెట్, స్వరూపం! పొగాకు ఇతరుల నిమిత్తం పొడుమైపోతోంది. అదే ముక్కుపొడుం స్వరూపం! (ఆ రూపంలో మూకుంతూక్ స్వరూపం)! పొగాకు ఇతరులకై, ఎండి, తడిసి. అష్టమైన మానవరూపులతోటీ కలిసి ముక్కముక్కలు అవుతోంది. అదే మసాళా స్వరూపం! పొగాకు ఇతరులకొరకై, సున్నమై నలిగి

పోతోంది. అదే పట్టీ స్వరూపం! పొగాకు ఇతరులకీ, శిబిచక్రవర్తికి మల్లే నిజశరీరం కండలు కోసి ఇస్తోంది. కొందరు ఉద్యోగులు ఏ కచేరీలోనో పనిమధ్యలో ఉండి, రొంటిని జాగ్రత్త చేసి పట్టిగెల్చిన పొగాకుముక్క ఆవళంగానే అమాంతంగా కొరుక్కు తింటారు, పటికబెల్లం తిన్నట్టు. దాన్ని 'కచేరీతాంబూలం' అంటారు—అదే కచేరీతాంబూల స్వరూపం! ఇప్పుడు మనం పొగాకుయొక్క ధూమలక్షణం వెల్లడిచేసే త్రిమూర్తులనీ గురించిమాత్రమే కొంచెం ఆలోచిద్దాం (ప్రపంచంలో ఉండే ప్రతీమారుమూలలోనూ పొగాకు మతం వ్యాపించేయ్యడానికి ఎక్కువ అవకాశం ఉంది గనక!)

చుట్ట అనే వస్తువు పొగాకుకి తాదాత్మ్యస్వరూపం— అనగా అభేదస్వరూపం. కాని కొందరిమతం వేరు. కొన్ని చుట్టల్లో పొగాకుకాడలు మాత్రమే ఉంటాయనిన్నీ, మరికొన్నింటిల్లో పారేసిన చుట్టపీకల కళేబరాలుంటాయనిన్నీ, వారి అభిప్రాయం. అయినప్పటికీ చుట్టయొక్క పొత్తి పొరాలు ప్రకృతి పురుషులనిన్నీ, వాటిమూలంగా పరమాత్మ కణకణలాడుతో వ్యక్తమౌతాడనిన్నీ అందరూ ఒప్పుకుంటారు. బీడీ లోపలిభాగం పొగాకు తుక్కు అయినప్పటికీ, బాహ్యం మాత్రం, వేరేపత్రం—తునికీ ఆకు, కొండొకచో జిల్లేడు. సిగరెట్టు లోపలిభాగం, అనేక ఓషధుల సాహాయ్యంచేత పొగాకుయొక్క కసటు పోగొట్టుకుని నవ్యసౌరభం ఆర్జించి, కాకితపు దాంపత్యంకలిగి ఉన్న నవీనావతారం. సిగరెట్

స్వరూపంకాక, తక్కిన రెండూ హిందూదేశానికి చెందినవే అని ఒప్పుకోవచ్చు. బీడీ మహామ్మదీయులది, అపత్రంకూడా వారిదేశంలోనే దొరుకుతుంది. ఆమాట ఋజువు చేసుకోవచ్చు పొగాకు అమెరికాలో, ఒక తెల్లఆసామీ ప్రయాణంచేస్తూ కనిపెట్టినట్లు చెబుతారు గాని, వొట్టిమాట! అది ఈ దేశాందే అని చెప్పడానికి అనేకనిదర్శనా లున్నాయి. సోమపానం, ధూమపానం గురించి సెలవిచ్చినట్టే ధూమపత్రంగురించి కూడాఅనేకమంది ఋషులు స్పష్టంగా, తేగేసి, సెలవిచ్చారు వెనక బాగా చుట్టకాల్చడంచేత ధూమబిరుదు తెచ్చుగున్న ఒకాయనయొక్క సంతతి వాడేట ధౌమ్యుడనే అబ్బాయి! ఇంకా ఇతరనిదర్శనాలు కావలిస్తే, 'రిసర్చి' చేస్తే, మనకి ఏవిధంగా సాక్ష్యాలుకావాలంటే ఆవిధంగా, రాగిరేకులు, తాళపత్రగ్రంథాలు, నాణాలు వగైరాలు దొరుకుతాయి. మనకి ప్రతికూలంగా ఉండేవికూడా దొరికితే దొరకవచ్చుగాని అది రిసర్చిగనక వాటిని కప్పిపుచ్చడంలో ప్రత్యవాయువు లేదు. అందుకని చుట్టగురించి మన స్వవిషయంలా మాట్లాడుకోవచ్చు. చుట్ట అంటించడానికి పూర్వం చివరకొన పంటితో కొరుకుతారు—చివరమెలెట్టి వుండడంవల్ల ఓచివరనించి ఓచివరకి గాలిలాగటానికి రాధారీలేదేమో అనేభయంచొప్పున. బీడీ వెలిగించడానికి పూర్వం, దాన్నితల్లకిందులుగా పెదవులలోపలికి పట్టుగుని, పెదవులుబిగించి, వెలిగించబోయే వేళకి ఆవిరి పెడతారు—కొంత ఆవిరితడి దానికితగిలి అది హెచ్చు తగ్గులు

లేకుండా గుండ్రంగా కాలుకుంటూ రావడానికిన్నీ, లోపల వేంచేసి ఉన్నటువంటి పొగాకు రేణువులు పీల్చే చివర నక్కి ఉండి, బీడీ వెలిగించి ఆదుర్దాగా పీల్చగానే, ఆ మొదటి పీలుపులోనే గొంతుకలో ప్రవేశిస్తాయేమో, వాటికిముందస్తుగా ఉద్వాసన చెప్పకపోతే ఎల్లాగరీ, అనే అభిప్రాయంతోటీసీ! సిగరెట్టు ముట్టించడానికి పూర్వం, దాన్ని పుస్తకంలాంటి బల్లపరుపు ప్రదేశంమీద ఉంచి, అరిచేత్తోనొక్కి, ఇటూ అటూ రెండుమూడుసార్లు అప్పడాల కర్రగనుల్లే దొల్లించి, తీసి, పుస్తకాన్నెత్తి, మెల్లిగా తాటిస్తారు—అది లోగడ కట్టబారి ఉండినట్టయినా పొగ సజావుగా రాకపోతుందేమో అని భయమేసి. ఇలాగ్గా ఈస్వరూపాలు జీవం దాలుస్తాయి. ఈమూడింటిలోకీ బీడీ అదోరకమోస్తరు "జంతువు. ఏమాత్రం వ్యవధానం లేక పెద్దపనిలోఉండి ఒక్కదమ్ము, లిస్తులో, లాగిపోడానికిమాత్రం టైము సరిపోయే పెద్ద ఉద్యోగస్థులూ, కాసికి చాలావస్తాయిగదా ఎప్పుడు పారేసినా పారెయ్యొచ్చు, మనస్సుకేమీబాధ లేకుండా--అనుకునే కొద్దివాళ్ళూ, ఎవళ్ళైనా చేయిచాస్తే, క్షోభ లేకుండా వాడికి ఓటివ్వొచ్చును--అనేవాళ్ళూ వగైరాలు బీడీసేవిస్తారు. అయితే, ఓ కాలిబీడీలకి ఓఅగ్గి పెట్టెనా అధమంకావాలి గనుకనున్నూ, ఎక్కడేనా ఆ జంతువు తాలూకు ఒక నెరుసు పడిందంటే ఆ చుట్టుప్రక్క ప్రాంతం అంతా దగ్ధపటలం అవుతుందనే భయంచేతనున్నూ దాని ప్రచారం కొన్ని కొన్ని చోట్ల ఉంటుంది.

ఇక చుట్టాసిగరెట్లని రెండింటినీ మాత్రమే పోల్చాలంటే, చుట్ట మోటు, సిగరెట్టు నీటు, చుట్ట నల్లజాతి, సిగరెట్టు తెల్లజాతి. చుట్టఅంతా పొగాకే గనక, అది పత్రగ్రంథము, కాబట్టి ఆధునికం. ఇంగ్లీషుచదువుకీ సిగరెట్టుకీ సంబంధం ఉందని ఋజువు చూపించడానికే సిగరెట్టు కాకితంతో చేశారని కొందరినమ్మకం. చుట్టవాసన చుట్టకంపు, సిగరెట్టువాసన సిగరెట్టుపరిమళం. ఆ పరిమళం గ్రహించలేనివాడు తనకి మళ్ళీ మహా ఇంగ్లీషువచ్చునని ఏ మొహం పెట్టుకుని చెప్పుకోడం అని కొందరి ఊహ. ఏముంటే! ఆ సిగరెట్టువాసన కేవలం ఆ ఇంగ్లీషువాసనేనండీ!

ఈ రెండు స్వరూపాలూ కూడా వాయురూపేణా మారుతమై, జగత్తంతా చివరికి మాయగా అని చెప్పక చెబుతూంటాయి. ఇవి వెలిగి వెలిగి బూడిదకూడా అవుతాయి. ఆవిషయంలో చుట్టబూడిదే పేరుపొందింది. దాన్ని కొందరు చచు పిలుపులు పిలవక "చుట్ట విభూతి" అంటారు. కొందరు రహస్యంగా చుట్టకాల్చేవాళ్ళు అల్లాంటి విభూతి జాగ్రత్తగా కాల్చీ అగ్గిపెట్టెల్లో కిందరాలకుండా దాచి అది కుసుమాలకి మందుగా వాడుతున్నారట, మతాబా బూడిద వాడినట్టు! సిగరెట్టు విభూతికి అంత తెల్లదనం లేదు, పేరూ లేదు. అందుకనే అది జాగ్రత్తచెయ్యరు. కొందరు, తక్కువవేళ్ళతో సిగరెట్టు పట్టుకుని చూపుడువేలు ఒక్కటే మాత్రం ఆడిస్తుంటే, ఆ విభూతి ఊడకొడతారు. మరి కొందరు దాన్ని తర్జనీ మధ్య

మాలతో నొక్కిఉంచి, ఒక్క చిటికెలో ఆ విభూతి విసర్జిస్తారు. క్రియకి, గాలి గాలిలో కలిసిపోతుందర్రా అని ఈ రెండూ కూడా సెలవిచ్చినా, వీటిల్లోనూ మళ్ళీ కాస్తంత తేడా ఉంది. సిగరెట్టుముట్టుకి అంతా ఆఖరికి శూన్యమే అంటుంది. చుట్ట అల్లా అనదు. చుట్టకాల్చేవాళ్ళు ఉమ్ములు వేస్తుంటారు. (ఉమ్ములవిషయంలో వీళ్ళని మించేవాళ్ళు మరోళ్ళున్నారు, మసాలా కిళ్లీలవాళ్లు! ఆ ఉమ్ముల అభిప్రాయం ఏమంటే, చివరికి జగత్తంతా గాలిలో కలిసిపోదు, ఉంటే జలప్రళయం ఉండచ్చునన్న! అని. ఉంటే ఉండడం ఎంచేతంటే, కొందరు కొందరు చుట్టేశ్వరులు ఆ ఉమ్మి మింగేస్తారు. చుట్టలో పొగాకు చుట్టుగుని ఉండడంవల్ల దాల్లోనే ఎక్కువ తిరగడం ఉంది. సిగరెట్టులో వక్రత లేదుగాని, చీలిపోడం ఉంది. చుట్టలో ఉండేచెడు, రంగు, గీర వగైరాలు సిగరెట్టులో మృగ్యం. ఆరిందా జనంమధ్య ఉన్నప్పుడు సిగరెట్టే పీల్చాలి అనిన్నీ, తప్పనిసరిఐతే ఇతర స్వరూపాలు దొరకనిస్థలంలో మాత్రం బీడీ ఊదుకోవచ్చుననిన్నీ, కేవలం బాహ్యానికి వెళ్ళి కాల్చడానికే చుట్టపుట్టిందనిన్నీ సిగరెట్ పక్షపాతులైన స్నేహితులు వాదిస్తారు. కాని, ఒంటరిగా ఉన్నవాడికి చుట్టే చుట్టం. ఎంచేతంటే, ఒక్కొక్కడు, కుర్చీలో కూర్చుని, చుట్టకాలుస్తూ, పొగకేసి చూస్తూ, గంటలకి గంటలు గడుపుతూ, పర్యవసానం శూన్యం అయినా దీక్షగా ఏదో ఆలోచిస్తూన్నట్టు గంభీరంగా ఉండగలడు. సిగరెట్టువాడు అలా ఉండజాలడు. చుట్ట

వాడు, తను ఏదోమూల కూర్చునిఉన్నా, ప్రపంచం జరగడం విషయంలో తన ఖంజాయింపు కూడా కొన్నివాళ్ళు ఉన్నట్టు కనిపిస్తాడు. కాని, కిల్లీసమితే టైములోనే చుట్టకాల్చడానికి వీల్లేకపోవడం చుట్టయొక్క దౌర్భాగ్యం. ఆ కాలం సిగరెట్టుది. అందుకనే, భోజనమై, తాంబూలం వేసుకుని, అద్దం ఎదట "నెక్టై" ముడేసుకుంటూ, పెదవి చివర సిగరెట్టు ఊగిసలాడుతుండగా, అప్పుడే మాటలు చెబుతూ, నాగరికత కాపాడుతూన్న ఉద్యోగులు తొమ్మిదిన్నరకి ఇళ్ళల్లో దొరుకుతారు. చుట్టకాల్చడానికి దాన్ని పళ్ళతో దబాయించి పట్టుగోవాలి. అందుకని, అవతలంచున అగ్ని ఇవతల చివర (లాలా) జలం. సిగరెట్టుని పళ్ళతో నొక్కినవాడు వొట్టి అభాంద్రాపీనుగు. వాడు, అది ఎంతకోమలం అయినదో గ్రహించనివాడు; వాడిపళ్లు ఊడకొట్టినా పాపంలేదన్నాను. ఒక సిగరెట్టిన్ను! అంచేత, దాన్ని పెదవులతో పట్టాలి. ఆమాటకొస్తే కొందరు ప్రజ్ఞావంతులు పెదవి చివరతో కూడా సిగరెట్టుని నిలబెడతారు, మీనం మీద నిమ్మకాయ నిలబెట్టినట్టు. అందుమూలాన్ని, సిగరెట్టు ఇవతలకొన తడిగా ఉండదు. ఆ కారణంవల్ల, సిగరెట్టులోని అద్వితీయవిశేషం ఏమిటంటే, అది మధ్యరంగంలో తీసి, ద్వితీయుడికిఇచ్చి, వాడిప్రాణం రక్షించచ్చు, ఆట్టే ఎంగిలి కలియకుండా! ఈ అవాంతరం తప్పిపోయే టందుకుగాను, కొందరు మిత్రులు ముందే సిగరెట్టుని నమద్విఖండనచేసి చరోనగం మొదట్లోనే పుచ్చుగుంటున్నారు. ఇది అరుదు. చుట్ట

జంతువుకీ ఇల్లాంటి ప్రజ్ఞ లేదు. కాని అందులో విశేషం మరోటి ఉంది. కాల్చేఆసామీయే దాన్ని తల్లకిందులుచేసి పెదవులతో పట్టుకోవచ్చు. ఇది కొన్ని కొన్నిరకాల సోదరసోదరీమణులలో అభ్యాసం. చుట్టపొగ ముక్కులోంచి తెప్పించడం అంత సులువు కాదు; అందులో పాటి ఆకు మరీ శ్రమ. ముక్కులోంచి పొగలొస్తాయనే కొందరు సిగరెట్టు కాల్చడం. చుట్ట కాలుస్తూ మాట్లాడితే, శబ్దధాతు వర్గాలు పలకవు: వినేవాడికి చిరాకు. సిగరెట్టుకాలుస్తూన్నప్పుడు, ఓష్ఠ్యంతప్ప, కడమా అక్షరాలన్నీ, మూతి వంకరగానో పెట్టిపలకవచ్చు, పళ్ళకి పనిలేదుగనక! చుట్టలో మరో చిక్కుంది. ఎవరో అస్తమానం ఇతర పనిమానుకుని పీలుస్తూంటేగాని ఆరి పోతుంది, వెధవ ఆరిపోడం ఇదీను! అందులో చుట్టఆరిపోడం ఉండదే, అది గొప్ప ప్రాబద్ధాల్లో ఒకటి. అందుకనే కొందరు చుట్ట కాలుస్తూండగానే ఏమరుపాటుగా నిద్రపోయినా ఏమీ ప్రమాదంలేదు. అది పట్టుతప్పి పడిపోయేవేళకి ఆరే ఉంటుంది. కాని, సిగరెట్టు ఎక్కువ బాధ్యతవహించిన ప్రాణి. సిగరెట్టుని అంటించి ఒదిలిపెట్టేస్తే, దానిపని అది క్రమేపీ చేసుకుంటూ పోతుంది, వెనకాల కొందరు లాగేవాళ్ళు ఉన్నా సరే, మానినా సరే. అనగా దానికి చూపిస్తే అందుకు పోగల తెలివి ఉంది. సిగరెట్టుకి పునర్జన్మలేదు. చుట్ట చాలా పాపం చేసుకున్న ఘటం గావును, దానికి పునర్జన్మలు ఉన్నాయి. అనగా, ఎవడేనా సోదరుడు కాల్చేకాల్చేచుట్ట

ఆరిపి, తలపాగా లోనో, గోచీమూలో పెట్టి కాస్సేపటికి మళ్ళీముట్టిస్తూంటాడు. అది వాడికి బాగుండో, తప్పనిసరో గాని కడంవాళ్లుచస్తారు. మంచిచుట్ట వాసనేస్తేనే డోక్కునే వాళ్లు, చుట్ట యొక్క జన్మాంతరవాసన తోటిఘూర్ణిల్లుతారు. చుట్టలో మరోపేచీ ఉంది. ఒకొక్కప్పుడు దానికి చిన్న "బుసి" ఉండి, పీల్చేవాడికి అంకిళ్లు పడిపోయినా సరే, పొగమాత్రం రాదు, చచ్చినా! దాంతోటి, ఆపీల్చేవాడికి ఊహాకోపం జాస్తీఅయి చుట్టు పక్కవాళ్ళని చంపాలని ఉంటుంది. అల్లాకొంత ప్రయత్నించి, కొసకి, వకాగితమో చుట్టబెట్టుగుని ఎల్లానో ఇదవుతాడు. సిగరెట్టులో ఈక్షోభలేదు చుట్టవల్ల పళ్ళన్నీ జీవితంలోనే పొగచూరడం కాక, పెదవి మీద వాతలుకూడాను. అదీగాక, చుట్టకాల్చడం అనేది ఒక పనిలా కనిపిస్తుంది, సిగరెట్టు కాల్చడం పనిగాని పని—అందుకనే సిగరెట్టు చదువుకున్నవాడికోడి! చుట్టవెనకేంతో, ఇప్పుడూ, ఎప్పుడూ అంతే! సిగరెట్టు స్వల్పకాలంలోనే మారుతుంది, కొత్త మాన్యుడు దిగుతుంది. ఇంత తెలివితేటలతో ఉన్న సిగరెట్టు కాల్చడం వల్ల ఉండే లాభాలు తియ్యడానికీ, ఉన్నాయేమో చూడడానికీ, ఓకమిటీవారు పనిచేస్తున్నారు, సులోచనాలు పెట్టుగుని. ఇది కాల్చడంవల్ల ఉండే ఖర్చు లెక్కవెయ్యడానికి మరోకమిటీ ఉన్నారు. వీరి రిపోర్టులు తేలేయోగ్యత కనిపించదు.

హెచ్చుతగ్గులు ఎల్లా ఉన్నాసరే, నేను చుట్టమానను.

మాన్తే భూ—వాయు సమస్య పరిష్కారం కాదు ఈ ముక్కలే నాకు శరణు...అన్నాడు ఒకడు.

"ఎముక మిగిల్చి మాంసమునెల్ల భక్షించు
క్షయరుగ్మతలకు వజ్రాయుధంబు
లోహమాందూరాల లొంగక సాధ్యమా
కఫవాతములసిత కార్ముకంబు
శూలాన పొడిచిన లీల శూల జనించు
అల యజీర్ణముల సిద్ధౌషధంబు
ముబ్బుపట్టిన యంత బొబ్బలు పెట్టించు
దుబ్బసాములకు సూర్యోదయంబు
జనుల నగ్నిముఖుల నొనరించు నీ చుట్ట
కంపులెల్ల పొగనంపుచుట్ట
దోమ బాధ తొలగ ద్రోయును పొగచుట్ట
చుట్ట మహిమలెన్న శూలి కగునె"

మంచిచెడ్డలు ఎల్లా ఉన్నానరే నేను బీడీ మానను. మాన్తే, హిందూ—మహమ్మదీయ సమస్య పరిష్కారం కాదు. ఈ ముక్కలే నాకు శరణు—అన్నాడు ఇంకోడు.

దాడీ ముందుగ వచ్చెను
బీడీ తరువాత వచ్చె విధవిధములుగా
బీడీ పొగలకు పొద్దా
వడీ కావదనడి ఫురుషుడెల్లా హైనం.
నుళువు బలువులు ఎల్లా ఉన్నానరే నేను సిగరెట్టుమానను.

మాత్రే, ప్రాచ్య-పాశ్చాత్య సమన్వయ పరిష్కారం కాదు. ఈ ముక్కలే నాకు శరణు—అన్నాడు మరొకడు.

నాగరికత లేని ప్రజ
సిగరెట్ చవి చూడకుండ సిగరెట్ పొగరెట్
సిసిసిగరెట్ పొగపొగరెట్
సిగరెట్ పొగరెట్టుటంటు చెప్పను "న్యూర్తీ"

ఇలాగ్గా, ధూమ విషయంలో హిందువులు యథాశక్తి పనిచేస్తున్నారు. కాని అంతా సహకరిస్తేగాని కార్యం నెరవేరదు. అంతా చేతులు కలిపి పనిచెయ్యాలి. ధూమం, కీర్తికీ సున్నకీ తెలుపు కాబట్టి, ఏనాడు హిందూదేశమంతా ఏకమై పొగపీల్చి వదలుతుందో, నాడే ఈ దేశపు శుభ్రకీర్తి దశదిశలా వ్యాపిస్తుంది. స్త్రీలుకొందరు ఇంగ్లీషు నేర్చి, పురుషులతో సమానం అవడానికి చేస్తూన్న యత్నాలలో సిగరెట్టు సేవిస్తూ ఉండడం శుభసూచన. ఈ ధూమ స్వరూపాలని కనిపించినప్పుడల్లా అంటిస్తే, లోకకల్యాణం ఆట్టే దూరం ఉండదు.

## రౌండు టేబుల్

ఓ చోట జరగబోయే రౌండుటేబిల్ కాన్ఫరెన్సులో వెయ్యవలసిన టేబిల్ గురించి మాటామాటా వచ్చింది. రౌండు టేబిల్ అనేది ఏదో ఊరికే గుండ్రంగా ఉండడమే కాక

సంపూర్ణంగా ఉండాలని కొందరన్నారు. మరికొందరు అట్లా వీలుకేదనిన్నీ, భూమిగాని మరి ఇతర గ్రహాలుగాని, అవి నడిచేదారులు గాని, ఏవీసంపూర్ణధోరణిలో లేవనిన్నీ, అందు చేత అయినదానికీ కానిదానికీ సంపూర్ణం అంటూ కూర్చోక వట్టి పూర్ణం ముందు పుచ్చేసుకుని ఆ పైని "సం" దెబ్బలాట ఆడితే, కడుపు నిండుతుందనిన్నీ, కాబట్టి ప్రస్తుతం టేబిల్ యొక్క ఆకారం కోడిగుడ్డులా ఉంటుందనిన్నీ, వాదించారు. టేబిల్ యొక్క ఆకారం ఎల్లా ఉన్నా అది కొంతేనా ఇటూ అటూ జరగాలంటే, టేబిల్ యొక్క ప్రతికోడుకీ కింద చక్ర ప్రయోగం చెయ్యక తప్పదని మరికొందరు తెలివిగలవారు అన్నారు.

శారదాబిల్లు

శారదాబిల్లు శాసనం అయినా దాన్ని జనం శారదా బిల్లు అనే వాడుతూంటారు. ఈ పరిపాలనలో జనం ఆబాల గోపాలంగా ఉచ్చరించిన పేర్లల్లో ఇదొకటి. కాని ఈ మాట యొక్క వాడకం, అర్థం, వ్యాఖ్యానం పాత్రల్ని బట్టి ఉంటోంది. కొందరు దాన్ని 'శార్ధపు' బిల్లు అన్నారు— అనగా దీనితో శార్ధాలు ఆఖరు అనో, లేక దీనితో శ్రోత్రియత్వానికి శార్ధం అనో. కొందరు ఇది 'సరదా' బిల్లు అన్నారు— అనగా దీనితో జనానికి ఎక్కడలేని షోకులూ బయల్దేరు

తాయని గావును. శారద అంటే సరస్వతి గనక ఈ బిల్లువల్ల ఆడవాళ్ళు మాటలు నేర్చి మరి ఎవ్వరి మాటా లెక్కచెయ్యరు అని కొందరు. శారద అంటే 'నూతనం' అని అర్థం గనక ఈ క్రొత్తబిల్లుని శారదాబిల్లు అన్నారని కొందరు. శారద అంటే అనవస్థుడు అని ఉంది గనక అల్లాంటి వాళ్ళ బిల్లుని శారదా బిల్లు అన్నారని కొందరు. శారదా అంటే శరదృతువులో జనించింది అని అర్థం. ఇది కూడా శరదృతువుయొక్క సామీప్యంలో పుట్టించింది కాబట్టి ఇది శారదాబిల్లు అన్నారని కొందరి మతం. శారద అంటే ఏడేసిపత్రాలు ఒకొక్క పర్వం దగ్గిరఉన్న అరటిచెట్టు అనికూడా ఉంది గదా, అందులో కూడా ఏడుస్తూ ఏడుసార్లు ప్రతీపర్వానికీ పత్రాలు అనే విడాకులు పుచ్చుకోడం ఉంటుందిగదా అని దీన్ని శారదాబిల్లు అని ఉంటారు అని కొందరి వాదన. శా అంటే దేవతాపూజ, ర అంటే శూన్యం(అయి) దా అంటే మాపులు(ఎక్కువవుతాయి) గనక ఇది శారదాబిల్లు అని ఒకరు. శా అంటే సామర్థ్యం ర అంటే నశించి ద అంటే భేదాలు (ఎక్కువవుతాయి) గనక ఇది శారదా బిల్లు అని ఒకరు. శా అంటే శ్రేష్ఠుడు (కూడా) ర అంటే రిపువు (వంటి) దా అంటే భార్యని (వేసుకోవాలి) గనక దీన్ని శారదాబిల్లు అన్నారని ఒకరు. శా అంటే తేజస్సు (తో) ర అంటే వజ్రం (లాంటిదేహాలతో) ద అంటే వీర్యులతో (జనం పుడతారు ఇప్పటి కుష్ఠిరకం కాకుండా) అందుచేత ఇది శారదాబిల్లు అని ఒకరు. శా అంటే

లక్ష్మి (ఉండాలి), ర అంటే మన్మథపరిపాలన (ఉండాలి), దా అంటే వైరాగ్యం (లాభంలేదు అనేటట్టు వస్తుంది) గనక దీన్ని శారదాబిల్లు అన్నారని ఒకరు. ఒక ముసలావిడ ఈమధ్య మాట్లాడుతూ "అయితేనూ, ౧౪ ఏళ్ళలోపల పిల్లలు పెద్దమనుషులు కాకూడదంటూ పైవాళ్లు రూలు పెట్టారట నిజమేట్రా, అబ్బాయి!" అని కొడుకుని అడిగింది. రేపు ఏప్రిల్ ఒకటో తారీఖు లగాయితు ౧౪ ఏళ్ళలోగా ఇండియాలో పెళ్ళిళ్లు చెయ్యకూడదని దీని అర్థం అని ఒకావిడ వాదించింది. "అయితే, ఈ బిల్లు రెండుమూడేళ్ళదాకా ఆచరణలోకి రాదంటారు నిజమే?" అని కొందరు అనుకుంటూంటారు —అల్లాఅయితే బాగుండునని వాళ్ళ లోపలఅభిప్రాయం. ఒకవేళ అల్లా జరిగితే, ప్రస్తుతం పెళ్ళిచేసిన వాళ్ళలో కొందరు పశ్చాత్తాపపడతారు.

## ప్రిన్సిపాలు కాదలచినవారికి ఉండవలసిన లక్షణాలు

(ఒక కమిటీవారి అభిప్రాయం).

౧. ప్రిన్సిపాలు పొడుగేనా ఉండాలి, జబరదస్తీగా నేనా ఉండాలి, పిల్లకొస్తే రెండిందాలా ఉండాలి.

౨. ప్రిన్సిపాలు ఇంగ్లీషే చెప్పాలిగాని, తెలుగూ, హిందూస్తానీ, శాస్త్రంకాదు.

3 ప్రిన్సిపాలు కడుంవికాకపోతే పీడాపోయిరి అధమం

బడితే అక్కడ, ఎప్పుడు పడితే అప్పుడు లెక్చరు ఇవ్వడానికి (ఇంగ్లీషు) తగినవాడు కావాలి! లేకపోతే, ఆయన తాలూకా బోర్డు ఎలిమెంటరీస్కూలు మేష్టరుకంటె తక్కువ అను కుంటారు.

వార్తలు

౧. ఆంధ్రవిద్యార్థుల సమాశేశం యొక్క కార్య క్రమం యావత్తున్నూ ఇంగ్లీషు భాషలోనే జరిగి ఉండడం వల్ల, వారు తమభాష మానుకోడంలో ప్రకటించిన స్వార్థత్యాగానికి సానుభూతి కనపరుస్తూ అక్కడ హాజరుకాని, ఆంధ్రదేశరులు ఒకతీర్మానమున్నూ, అరిటిపండొలిచినట్టు భావబోధ అయి ఉండడంవల్ల ఆమోదం వెలిబుచ్చుతూ హాజరైన ఆంధ్ర స్త్రీ బాలవృద్ధులు ఒకతీర్మానమున్నూ యేడకుండాలేని తమ ఇంగ్లీషులో శ్రమపడి ఆంధ్రవిద్యార్థులు నిలబెట్టినందుకు తమ అమితకృతజ్ఞత గుర్తిస్తూ లండన్ కవులు ఒక తీర్మానర జుమున్నూ గావించి పంపినారని లోగడ ప్రచురింపబడిన సంగతి కల్లవార్త అని మావిశేషరి పంపిన సవరణ నేడే మాకు చేరింది.

౨. జంతువులకూతలు, పిట్టలకూతలు, లోకంలో తక్కిన శబ్దాలున్నూ తానొక్కడే పుట్టించి సభని రంజింప చెయ్య దల్చుకున్న ఒకధ్వనికాడు టిక్కెట్టు పెట్టగా, హాస్యానికి వేంచేసిన నూరురూపాయల జనలూ, అతడు రంగంమీదికి

వచ్చేదాకా ఉండబట్టలేక, ఆయా జంతుపక్షుల ధ్వనిభేదాలు సునాయాసంగా చెయ్యి మొదలు పెట్టగానే, హాస్యగాడు టికెట్టు సొమ్ము వాపసుచేసి, అట్టి అద్భుతచిత్రకళ సభవారు అభ్యాసంలేకుండానే ఆర్జించినందుకు వారిలో ఒకరికైనా మెడలు ఇవ్వకపోవాలని ఇచ్చేరు. ఆ మెడలు ఒక విద్యార్థి పడేసినందుకు ఆ క్రములు ఎల్లానో తీసుకుని చేసుకుని కొంచెం గర్వపడాలి.

3. ఒక గ్రామఫోను కంపెనీవాళ్లు గొప్పగాయకుల దగ్గిరనుంచి ఉచితంగా రికార్డులు పుచ్చుకోడానికి రాగపిల్లిలో దిగగానే, ఆంధ్రగాన విద్వాంసులగు ప్రముఖులు చాలమంది, తమకు ఆహ్వానం రాకపోయినా, కంపెనీవారికి తమరి ఆహ్వానం చేసే సంకల్పం మనస్సులో ఉన్నట్టు దివ్యదృష్టిని కనిపెట్టి, వెళ్ళగా, కంపెనీవారు స్వాగతపత్రం ఇవ్వనందున వీరు కోపంతో వెనక్కి నిష్క్రమించి సినిమాలో చేరాలని యత్నించుతున్నారని తెలిసింది.

4. రైల్వే ప్రయాణీకుల సంఘాలు కలిసి ఎన్నుకున్న ఒకాయన ప్రయాణీకుల కష్టాలుగురించి రిపోర్టు తయారు చెయ్యడానికి రైల్లో తిరిగితిరిగి కనిపెట్టిన సంగతి ఏమిటంటే!— రైల్వేకంపెనీవారికిన్నీ ప్రయాణీకులకున్నూ ఎంతో అన్యోన్యంగా ఉన్నందుకు మిక్కిలి సంతోషం అవుతోంది. జనులు కంపెనీవారి మాట జవదాటడం లేదు. కంపెనీవారు రైలు పెట్టెల్లో "ఎంగిలి మూయవద్దు" అని రాసిన ప్రకారంగానే

జనం అంతా పెట్టెలోపడే, జాగ్రత్తగా, అపతలికి చెదరకుండా, ఉమ్మి వేస్తున్నారు. మరిన్ని కంపెనీవారు "దొంగలున్నారు, జాగ్రత్త" అని ఎల్లానూ రాసేశారుగదా, ఊరుకుంటే వారు సమావేశమై చిన్నపుచ్చుకుంటారేమో అని ఎంతో అయిష్టంతో చాలామంది దొంగతనాలు యథాశక్తిగా చేస్తూనే ఉన్నారు. ఇది శాంతిసూచన—అని.

౫. నెలక్రితం మాపిఠాపురంలో అయి ఉన్న పెళ్ళి సందర్భంలో, కన్యాప్రదానం, పెళ్ళికొడుకు కాళ్ళు కడుగుతూన్న సమయంలో, కన్యాప్రదాతకి ముచ్చెమటలూ పోసేటట్టు ఓ తేలు అంటుపొడిచింది. ఎంత వెతికినా తేలు దొరకలేదు. చివరకి పెళ్ళికూతురు అన్నగారు తన టార్చిలైటు తెచ్చి "ఫోకస్" చేసిన మీదట, ఆ తేలు ఎంకా కుణుకూ బెణుకూ లేకుండా పెళ్ళికుమారుడియొక్క మడప సొరదల్లో మకాంచేసి ఉన్నట్టు తెలియవచ్చింది.

౬. లక్షపిల్లినగరంలో చాలామంది జేరి, భార్యాభర్తల విడాకులచట్టం ఉంటేనే చాలా బాగుంటుందని, ఏకగ్రీవంగా తీర్మానించారు. ఈ అభిప్రాయానికి ప్రతికూలంగా ఉన్న వాళ్ళని వాళ్ళు లోపలికి రానియ్యలేదు. దూసుకుపోయి వచ్చినవాళ్ళని నోరెత్తనివ్వలేదు. ఈ తీర్మానం వ్రాసుచేసినవారిలో చాలమంది భార్యలూ కారు, ఆఖరికి భర్తలేనా కారు.

౭. ఎలక్ట్రిక్ దీపాలు పెద్దగాలికి ఆరిపోయే స్వభావం కలిగి ఉండడంచేతనున్నూ,—(అంటే ఆ గాలికి తీగెలు

తెగుతాయి, తెగితే దీపాలు నిద్దరోతాయి), అవి ఉంటే దెయ్యంలా ఉండడం, పోతే ఏమ్యం అయిపోవడమేగాని సన్నంగా ముత్తెం అల్లాచేసి అట్టే పెట్టుగోడానికి వీలులేనివి అవడంచేతనున్నూ, చటుక్కున ఏసిగరెట్టైనా అంటించుగోడానికి గాని, ఏశెయ్యైనా వెచ్చబెట్టుగోడానికి గాని, ఈమన్యాత్రమిూ ఉపచరించేవి కాకపోడంచేతనన్నూ, రాత్రిళ్ళుకూడా నిస్తేజంగా ఉండి ఏగ్యానులైటైనా పట్టిగెడితేగాని కంటికి ఆనకుండా చీకటిచేత ఆవరింపబడి ఉండే రకంవి అవడం చేతనున్నూ ఇంకా నిదానంగా కొంతకాలం పరిశీలనచేసిన మిూదటగాని మేము అట్టే తొందరపడము అని చంద్రాపుర జనులు చేసుకున్న తీర్మానం, వారి జ్ఞానతేజానికి నమూనా.

౮. ఆంధ్రపేపర్ మిల్లంటే చప్పరించిన వాళ్ళల్లోకొందరు ఇవ్వాడు మిల్లుపొగవాడిలీ, కూతట్టి, తిరిగేసరికి బయల్దేరిన కాగితంచూచి తమరూ తెల్లపోయి "ఇంతాచేసి కాగితమేనా, పోదూ!" అని మళ్ళీ చప్పరించారు.

౯. కలవలపట్నం అనేనగరంలో పౌరులంతాపట్టిపట్టి తమ ఊరినూ్కలు హెడ్డుమాష్టరుగారి పని సరిగా లేక పోవడం చేత ఆయన్ని శిక్షించదల్చుకుని, ఆయన్ని పూర్తిగా తీసెయ్యడానికి చేతులురాక, ఆయన "హెడ్" మాత్రం తీసేసి మేష్టరీమాత్రం అట్టేపెట్టారు. ఆయన హెడ్ ఒక దీర్ఘమైనవ్యాధి అనిన్నీ, ఆట్టివ్యాధి వకోళ్ళాన్నీ లేని మరి యొకన్ని వారు ఆస్థానే వేశారనిన్నీ వినబడింది.

౧౦. నగరవాసులూ, అక్షరాస్యులూ అయిన ఆంధ్రజనం యావద్విశిష్టం ఎరుగున్న పేర్లనుగురించి కాఫీహోటల్లో ఒకరావుగారు మాట్లాడుతూ, "గయోపాఖ్యానం, వీరేశలింగం, భక్త చింతామణి, కాశీమజిలీలు, అపవాదనామనా!" లాంటివి సెలవిచ్చారు. ఈ లిస్టులో "నమస్తే" గాని, "శౌరిభజింతున్" గాని చేరే సూచన్లు ప్రతీనోటా గోచరిస్తూనే ఉన్నాయి.

౧౧. ఒకపట్టణంలోని కాఫీహోటళ్ళ యెదటవీధి భాగాలున్నూ, సోడాషాపుల ముంటటి వీధిభాగాలున్నూ, నాటక విగ్రైరాశాలల చుట్టుపట్లవీధులున్నూ, కంకరలేని వీధి భాగాలున్నూ, కావలసినవారి యిళ్ళమొదల వీధి భాగాలున్నూ అహోరాత్రస్నా తడిసే ఉండడంవల్ల వీధులు తడిపేయత్నంలో అంతమంది తమకితోడ్పడుతూన్నందుకు ఆ పట్టణ మునిసిపాలిటీవారు తమపౌరుల్ని అభినందించారు.

౧౨. గోదావరీతీరజనులు పుణ్యజనులనిన్నీ, ఋషులనిన్నీ ఎక్కడివాళ్ళో అనుకుంటారు. పుణ్యజనులు అనడంలో ఆశ్చర్యం లేదు, ఈయుగంలో. కాని ఇక్కడ ఋషులుండడం మాత్రం నిజం. ఎంచేతంటే, మెయిన్ రోడ్డు మీద ఎక్కడ చూసినా ముక్కుమూసుకుంటూను, స్మరించుకుంటూ ఉంటారు.

[మాటవరస (2)—1931

ఆర్ట్సు కాలేజీలో

24—1—1931 తారీఖున

పూర్వ విద్యార్థి సంఘ వార్షికోత్సవ సందర్భములో

శ్రీ గంటి లక్ష్మన్నగారి

అధ్యక్షత క్రింద జరి

గిన సభలో ఆసాం

పూర్తిగా చదివినది.]

## బలరామయ్యగారి ఇంగ్లీషుతమ్ముడు

వెనక, మాజంగరి! మల్లేనే మాతమ్ముడుకూడా పెద్దబాల శిక్ష పట్టి, పలకా చదరా పుచ్చుకుని వీధిబళ్ళోకివెళ్ళేవాడు. కాని, మాకు మరీ దగ్గిరవాళ్ళల్లో కొందరు ఇంగ్లీషును వెలిగించడం ప్రారంభించారు. వాళ్ళమీద పోటీకొద్దీ, వాళ్ళు కొస్త పక్కబెదురుగా ఉంటూండడానికి మావాణ్ణి ఇంగ్లీషులో వేశాం. ఇంగ్లీషు అనడంతోటే డబ్బుఖర్చు. ఖర్చు లేకుండా రాజవిద్య ఊరికే ఎల్లా అబ్బుతుంది చెప్పండి అక్కడికీ, మావాడికి, దులాబీఖర్చు లేదు పైగా మావాడు అయినకాడికి ప్రతీక్లాసులోనూ రెడ్డీకంవేసుగుని కదలకుండా, కూర్చుని, ఇల్లంతా ఒకడకి తీసుగురాలేదు, వాడిధర్మమా అని. నేచెపితే గర్వంలా కనిపిస్తుంది—మావాడు ఒలిమనుకు

వకసంతాగ్రాహి. తోటి వాళ్ళు చాలామంది ఏక్లాసులో బడితే ఆక్లాసులో మకాం వేస్తూండడం, మావాడు ఎక్కడా ముచ్చట కైనా ఫేలవకుండా, చడీచప్పుడూ లేకుండా ఇట్టే దాటుతూం డడం. అందుచేత మావాడికి అన్నీ మెప్పులే, అన్నీ బహుమతీలే వాడికి చదువుపిడుగు, పరీక్షపహిల్వాన్ అనే బిరుదాలు కూడా ఉండేవి, కాంత్రితసంపించీ. మరిప్పైక్లాసు చదివిత్తామూ మానామూ అని ఒక్కొక్క పెద్దమెట్టుదగ్గిర మేం లోపాయికారీగా ఆలోచిస్తూ ఉండేవాళ్ళం. ఆలోచన ఎందుకంటే తరవాత తరవాత దేవుడు రక్షించి మావాడు చెయ్యగల ఉద్యోగంలో ఆర్జించగలసొమ్ములో ఖర్చులన్నీపోగా మిగలగల డబ్బువల్ల, చదువు పెట్టుబడిసొమ్ముకి వడ్డీడబ్బులేనా కిడతాయా కిట్టవా అనే సందేహంచొప్పున. మరి లోపాయికారీగా ఎందుకంటే, డబ్బు ఖర్చుకి మేం సందేహిస్తున్నాం అని వెల్లడి అయితే, మా పరపతి సన్నగిల్లుతుందేమో అనే భయం చొప్పున. ఇంతలో ఎవరో పెద్దమనిషి చక్కావచ్చి, నాతో ఈమాటచెప్పి ఆమాటచెప్పి, "ఇంకా చూస్తావేమిటయ్యా, బలరామయ్యా! మీరు జమీందార్లు. మీవాడు సీమపచ్చి మిరపకాయ వంటివాడు, చూపిస్తే అందుకుపోతాడు. వాణ్ణే చదువు మానిపించేరుగనక! సిరకం నారకం అయితే నేను మానిపించమనే పట్టుకుదును. ఓముక్క వచ్చేవాడికి చెప్పించకపోతే, త్యావస్త్రాసికిటయ్యా చెప్పించడం! చాల్చాలు. ఎవడేనావింటే నవ్విపోతాడు. తక్షణం పట్నం పంపించెయ్, శంఖంలో పోస్తే

గాని తీర్థంకాదు. అని నన్ను కోప్పడుతూండడం, దాంతోటి నేనుపొంగిపోయి, పైకిమ్మాత్రం చప్పరిస్తూ, ఏ తలో తాకట్టెట్టి మా వాణ్ణిపై క్లాసుకి పంపిస్తూండడం. ఇల్లాగ్గా జరుగుతోచ్చేది. మొట్టమొదట మా వాడు చదువులో సరసరా జువ్వలాగ పైకిలేచి, ఇంగ్లీషులో బాఘా తడిసి, నాని, ఊరిఊరి కున్నాడు. మాలో వీడికొక్కడికే ఇంగ్లీషురావడంవల్ల, వీణ్ణి మేం "ఇంగ్లీషుతమ్ముడు" అని వాడుతూంటాం.

మరి ప్రస్తుతం. మా వాడితో కలిసి చదువుతూ చిన్న క్లాసులోనే ఫెయిలైపోయి మానేసిన వాళ్ళపని, ఇప్పుడు, మూడుపువ్వులూ ఆరుకాయలూగా ఉంది. అచ్చే, మరో చమత్కారం! వాళ్ళల్లోనూ ఎంత చిన్నక్లాసులో ఫెయిలైతే ఎంత పెంద్రాళే ఇంగ్లీషుమానేసినవాడైతే ఉంటే, అంతపని కొచ్చేవాడూ, అంత సంపాదనపరుడూ అయిపోయాడు. మా వాడో! చదువుకునేటప్పుడు వీడిపని ఎంతప్రభగా ఉండేదో ఇప్పుడు అంత నస్సరంతిగా ఉంది. వీడికి ఉద్యోగం ఇస్తాననే నాసి ఎవమానస పష్టు. ఎక్కడేనా ఉద్యోగం ఖాళీగా ఉందని తెలిసి ప్రయత్నించం చడానికి వెడితే (అనుకుంటే తిప్పు, ఇల్లావెళ్ళడానికి బోలెడైంది!) ప్రతీఅధికారీ మా వాడితో "నువ్వేంపని చెయ్యగలవ్?" అంటాడటగాని, "నువ్వు ఎంత పెద్దపరీక్షపాస్సయినావ్?" అని అడగనే అడగట్ట!! ఏమైతేం, వీడికి ఒక్కడమ్మిడీ ఇంటో పడేద్దామనే ఊహా లేదు, పడెయ్యగలప్రజ్ఞలేదు. తనూ, పెళ్లాం (ఆవిడ దగ్గిర మేం అసలు మాట్లాడలేం!) ఇద్దరు కూతుళ్ళూ

(వీళ్ళకి ఎప్పుడూ ఒళ్లు నసిగా ఉండదు)—వీళ్ళంతా ఉమ్మడి
సంసారంలోనే. అంచేత మావాడికి ఊహూ మొహమాటం.
అసలు వాడికి నోట్లో నాలిక లేదు. పైగా వాడిదంతా
అతిసుకుమారం! పైమీద కండువాకూడా బరువే. ఓ గజం
నడవలేడు—కారో, విమానమో కట్టిస్తాను. ప్రతీదీ దర్జాగా
ఉండాలంటాడు. సౌఖ్యం రావలసినచోట దాక్షిణ్యం అంటాడు,
ఇవ్వవలసినచోట తూర్పుమొహంగా తిరిగి దణ్ణంపెట్టేసివచ్చే
య్యకుంటాడు. వీడు చదివింది ఏమిటో మాకు తెలియదు,
ప్రపంచానికి అక్కర్లేదు, (వాడేం జేశాడు, మేమే చదివించాం
లెండి!) దైవచింత ఉందేమో అంటే, దేవుణ్ణాన్నై గుహాన్నై
అంటాడు; పైగా మన దేవుళ్ళు మనకంటె బొత్తిగా
అన్యాయం అంటాడు. సరి, మనింమాద్దాం అంటే వాడిమతం
నా కిమతం ఒక్కమోస్తరుగా కేడున్నాయి. పోని మనిషైనా
రాముల్లా ఉన్నాడేమో అంటే, అబ్బే, ఆకోటు తొడిగినంతసేపే
గాని, విప్పేస్తే నులిపిల్లివంట్లో పంపు మాంసం లేదు. అడ్డి
గెడ్డు నైతుకు లేదు. వార్తి ఎముకలపోగు. ఎవడేనా తనకి
అన్యాయంచేస్తే, వాణ్ణి
శాస్త్రి రకాయించడం అంటూలేదు—వాడిపాపాన్ని వాడే
పోతాడంటాడు, లేకపోతే ఇంటోవాళ్ళమీదా నామీదా
కోప్పడతాడు, లేకపోతే తనగదితలుపు రాముల్లా పెద్ద గడియ
వేసుగుని ఒక్కడూ కూర్చుని అవతలవాణ్ణి తిడతాడు. ఏవ
ళ్ళేనా బంధువులు తటస్థించినప్పుడు వాళ్ళతో—ఉన్నసంగతే

అయి, లేకపోతే లేనిసంగతాయిది—ఏదో వాటి యథాశక్తి అన్యాయం కనపరుస్తూ కలిమిడిగా మాట్లాడ్డం మావాడు ఎరగడు. ఎక్కడేనా రక్తస్పర్శ ఉన్నవాళ్ళల్లో ఎవరేనా కష్టం వచ్చినప్పుడు వాళ్ళని కాస్త పరామర్శ చెయ్యకపోతే బాగుండదని వీడికి తెలియదు. ఆవిధానం అసలు తెలియదు. తన సంసారాన్ని అత్తారింటి దగ్గిర్నించి తీసితెచ్చుగోడం తనకి సిగ్గుట, ఇంకోన్ని వెళ్ళి తీసుగురమ్మంటాడు; ఏమనుగుతాడూ! కిస్తువసూలు కోసం పొలాలమీదకివెళ్ళి రారా అంటే, అక్కడ ఏమీ తోచదంటాడు. మొన్నమట్టుకి మొగిట్టుకు రెంటగా వెళ్ళి, వసూలుసొమ్ము సాదరుఖర్చుకి చాలక, నోటు రాసుగుని ఇంటికొచ్చాడు. పోనీ, అయ్యా, ఎప్పుడేనా తేళ్ళొస్తే ఎవడేనా పైజారుచ్చుగుని పచ్చడికింద కొట్టడూ! మా తమ్ముడేం జేశాడూ! “తేలు ఎంత మంచి దనుకున్నారు! దోషం అంతా దాని కొండిది. కొండి పట్టేస్తే, అది ఎంతో సాధువైపోతుంది. నేను పట్టుగుంటున్నా, చూడండి!” అని రెండువేళ్ళతో పట్టాలని యత్నించాడు నేర్పుగా. కాని, దానిముండమొయ్యా, తేలు, అంతకంటె ఎక్కువ నేర్పుగా ఒకదెబ్బని రెండువేళ్ళ మీదా కుడా కుట్టింది. ఇక, పాము అంటే అసలే అశలేదు. మాతమ్ముడికి రాత్రెళ్లు చీకట్లో వెళ్ళడం భయం. ఏమిరా అంటే, “పురుగూ బూట్రా ఉంటాయేమో అని బెదురుగాని దొంగభయం ఉన్నప్పట్నించీ లేదు.” అంటాడు. దొంగలంటే జ్ఞాపకం వచ్చింది. మొన్న ఈమధ్య ఒకమనిలాయన ఇంటో

దొంగ లడ్డారు. ఆయన జీవితం అంతా మాటలు చెబుతూనే ఉన్నవాడైనా, దొంగాణ్ణి పట్టడంలో—ఎల్లాగనుకున్నారు మళ్ళీ—భల్లూకప్పట్టు పట్టేశాడు. తరవాత వారానికి మా ఇంటికీ దొంగలొచ్చారు. అప్పుడు మా తమ్ముడు మెణుకువగానే ఉండి, మొహంమీదికి కూడా శాలువ లాగి కప్పుకుని పడుకున్నాడు గాని, వాళ్ళు ఒక్క వరసని ఇల్లంతా వీథిలో పెడుతూంటే కేకలేనా వెయ్యలేదు. ఏమిరా అని మొన్నాడు కనుక్కుంటే, కేక లేస్తే తనకి నామర్దాట. పైగా, తను అప్పుడు మెణుకువగా ఉన్నాడో, నిద్దరలో ఉన్నాడో అది ఓ పెద్ద స్వప్న సమస్యట, ఆ అవస్థ గురించి ముందు ముందు శాస్త్రం రాస్తానన్నాడు. పోనీ, తనుసొమ్ము తేకపోతే పీడాపోయింది, నేను ఎప్పో మాసికలుపడి తెచ్చిన డబ్బెట్టి బజార్లోంచి ఏమన్నా వస్తువులు తేరా అంటే, టైం లేదంటాడు. ఒక్కొక్కప్పుడు ఇంట్లో పోరు పడలేక బజారికి వెడతాడా, ఆఖరికి కూరలు తేవడమేనా తెలిసుదు. ఎక్కడకి దాళా ఉంటుందని మా వాడు ఎరగడు. కొనుక్కునే వస్తువులు మంచివో కావో ఎరగడు. వంకాయకి ముచిగి దళసరిగా ఉండాలనీ, ములక్కాడ మెలితిప్పితే తిరగాలనీ, వెలక్కాయలు డీకిక్కలు కొట్టి చూచుకోవాలనీ, బెండకాయ చివర విరుగుడుపడాలనీ, ఆనప కాయ గోరు దిగేటట్టు ఉండాలనీ, వగైరాలు మావాడికి బొత్తిగా తెలియవు. అట్ట—వెళ్ళటం. వెళ్ళి, దుకాణదార్ని 'ఈసరకు మంచిదేటయ్యా!' అనడం. అంటే అతను 'బంగా

రం అండి. ఫస్టు. మానాణ్యమైన సరుకండి.' అంటాడు. లేక పోతే, అమ్మేవో దల్చినవాడు తనసరుకు చవలచెత్త అంటాడా, చెప్పండి! దాంతోటి, మావాడు, "అయితే, ధర సినతేగా?" అంటాడు. అంతేగాని, వీశెంత, శేరెంత, తులం ఎంత అని అడగడు. ఎంచేతో తెలుసునా? ఏవస్తువు ఏలెక్కని ఉంటుందో ఎరగడు. ఓమాటు కస్తూరికని వెళ్ళి, 'వీశెంత?' అని అడిగాట్ట. అది మొదలుచేసుకుని, ఉన్నది ప్రశ్నలు వేస్తున్నాడు. దుకాణదారు, "అయ్యా! మాదగ్గిర రెండు మాటల్లేవు. వాకబు చెయ్యండి. తేడావస్తే రెట్టింపు ముకరా యిస్తాను" అంటాడు. అంటే మా వాడు, 'అయ్యా బేరం చెయ్యడం నాకు అసహ్యం. ధర విషయమా! మీ యిష్టం వచ్చినట్టు పుచ్చుకోండి. ఓ డబ్బు అయినా సరే మాకి ఆ లక్ష్యం లేదు. సరుకు మంచిది కావాలి. త్వరగా యిప్పించండి, నాకు టైం లేదు' అంటాడు. అంత ముళ్ళమీద నుంచుంటే బేరాలు ఎల్లా కుదురుతాయి! ఆఖరుగా ఏవో తెచ్చి ఇంటో వేస్తాడు. అక్కణ్ణించి, స్నేహితుల్తో జేరి పేకాట, లేకపోతే, వాడిల్లాంటివాడు, వీడిల్లాంటివాడంటూ ఊళ్ళోవాళ్ళమీద యాగీ. ఇంతోటిశ్రమకీ మధ్యమధ్య ఫలహారం. ఓనాడు సీతాఫలాలు ఇంటికమ్మొస్తే, మావాడే బేరంజేశాడు. అమ్మే అమ్మి అర్ధణాకి అయిదు చెప్పింది. మా వాడు, "నాకు అయిదక్కర్లేదు. నాలుగే చాలు. ఏరి తీసుకుంటాను మంచివి" అన్నాడు. అసలు మంచివి ఏరి తీసుకునే

పద్ధతికే అయిందని దాని ఉద్దేశం. ఏం చెప్పనూ! ఇవన్నీ అల్లా ఉంచండి. పోనీ, ఇంతికోట్టుగుని తినేరకం కాకూడదూ! సమస్తం ఇంట్లో ఉంటాయిగా! తన కేమున్నా లోటు రానిస్తామా? పొద్దస్తమానం తెగ చిరుతిండి. చిరుతిండి వాళ్ళకి అసలుతిండి నోటు. అయినా సరే, భోజనంవేళ అయేసరికి, గంటప్రకారం, విస్తట్లో అన్నం పడాలంటాడు. కిడంవి ఎల్లానూ గంటలప్రకారం జరుపుగోలేం, భోజనమేనా జరపాలని మావాడి పట్టుదల. ప్రతీరోజూ ఇంట్లో రూల్సుప్రకారం ఎల్లా దేవుళ్ళాడుతుంది, చెప్పండి! తిండి తిండని ఇంతయిబులబాటమే గాని, తీరా విస్తరదగ్గిరికి, వచ్చేసరికి ఒక్క వాడైనా కలుపుకోకుండా, మెతుకులు, గోడిచిమ్మినట్టు చిమ్మి విస్తరంతా కళ్ళంఅల్లాచేసి చక్కా పోతాడు. అందుచేత, "నాయనా, సంపాదనా వద్దు, సమారాధనా వద్దు, నువ్వు అనుకుంటూన్న ఆత్మగౌరవం చెడగొట్టుగోకు, లోకవ్యవహారం నేర్చుగోకు, పోనీ ఇంత భోజనంచెయ్యడమేనా నేర్చుకోరా. వంటికి మంచిది. 'శరీరమాద్యం' రా." అని అనేక కాలం నించి మాతమ్ముడికి నూరిపోస్తున్నాను. వాడికి జ్ఞానోదయం కాలేదు.

## భోజనోపదేశం

ఏమని నూరిపోశావూ అని అడగరేం? మనవిచేస్తున్నా! వెనక, మాప్రసిడెంటుగారు నాకు నూరిపోసిన ప్రకారమే. వారు ప్రతీ పెళ్ళివిందుకీ వెళ్ళేవారు. మూఢమి ఉడ్డొచ్చి

కొన్ని పెళ్ళిళ్ళూ, తద్వారా విందులూ, ఆగిపోవడం నించి వారాగ్రహించి మూఢమి అనగా మూఢులు పెట్టిన సామూహ్య భోజన నియమం అనేవారు. శారదచట్టంవల్ల పెళ్ళివిందులు అసలే మూలబడిపోయిన ఈ సంవత్సరం క్రితం వరకూ, వారు సాలుకి యాభై అరవై విందులకేనా వెళ్ళేవారు. వారు ఒక చోట కొంతకాలం సూపాధ్యక్షులుగా ఉండి పిదప స్వయం కృషి చేత అఖిల ప్రపంచ భోజన మహామండలికి గౌరవాధ్యక్షులు అయారు. విశేషించి, భోజనానికి పడగెత్తారు. వారి పతాకానికి చిహ్నాలు—పీట, ఆకు, రాగిచెంబు, మానచక్రం, ఈ క్రింది సూత్రాలుగా వారు సెలవిచ్చే వారు:—.

"విందులకి తప్పకుండా వెళుతూండు, దాటపెట్టకు. భోజనం పెడతానన్నప్పుడు తినకపోతే, మళ్ళీ అప్పట్లో దొరకదు. అన్నింటికీ తయారీ అవసరం. విందుకి మరీ అవసరం. టిక్కట్లవిందుకి తెగ అవసరం. విందుసంగతి రెండు మూడు రోజుల పూర్వం తెలిస్తే, చూచాయగా తెలిస్తే చాలు, హారం తగ్గించుకో, లేక భేది స్వీకరించు. మరీ శ్రోత్రియుల పక్కని కూచోవలిసొస్తే, అధాత్తుగా మడికట్టుకోడం అవసరం అయితే చొక్కా తీసేసి, బిళ్ళగోచీ పెట్టి, పైమీద పంచ సన్నంగా మడతెట్టి, ఎత్తెత్తి అడుగులేస్తూ, జనాన్ని తప్పుకోమను. అగ్రం వున్న ఆకు చూసుకుని, ఈనె తీసెయ్! ప్రారంభించడానికి పూర్వం తెల్లబోయి మాట్లాడుతూ కూచుని సైం

పాడుచేసుకోక, అంటులేని మిఠాయి వగైరాలు రుచిచూచి పేచీవస్తే, వడ్డించలేదను. జలపదార్థానికి కూడా స్థలాక్రమణ రోగం ఉంది గనక, భోజనసంపూర్తి కాందే, ఉదకం తాగకు. తరవాత ఎక్కడేనా ఇంకోఇంటో కాఫీయే వింను చూపు మేరలో ఉంటే తప్ప, వప్పు 'డబుల్ డోస్' చెయ్యి. కొండొకచో మాగాయిటెంక వడ్డించినట్టయితే, వెంటనే మజ్జిగ తెప్పించి అందులో అవి ప్రవర్ధమాన్నే నానెయ్. ఆవడలు వడ్డించేటప్పుడు దిక్కులుచూస్తూ కూచోక అవి దధిసమేతంగా పడ్డాయో లేదో, సరిగా పడ్డాయో లేదో గమనించు."

అంటే మాతమ్ముడు, "సరిగా పడ్డంవేమిటి? నాకు తెలియనట్టు చెబుతాంవే అన్నయ్యా!" అన్నాడు.

"సరిగా అంటే సరిసంఖ్యలో, అనగా, రెండు, నాలుగు, ఆరు ఇల్లాపడవలసినవే గాని అవి, బేసిగా దిగకూడదు. అవి కొంతవరకు పుచ్చుకొంచి, వడ్డించేవాణ్ని దగ్గిరికిపిల్చి, చెవులో చెప్పి, "పూర్వాశ్రమం" తెప్పించండి' అని. "పూర్వాశ్రమంఅంటే ఏమిటన్నయ్యా!" అన్నాడు మావాడు. "ఎంతసత్తెకాలంరా నీది ! పూర్వాశ్రమం అంటే కారప్పుగారె. ఇంకా పెరుగులో పడనప్పుడు అదేగా మరి దాని జన్మ ! అవి అందిన వెంటనే మరోవా వడ్డించే వాణ్ణిపిల్చి (మొదట వాడే అయితే దిప్పికగలచ్చు) "నిజస్వరూపం" వత్రమ్మను. అది కారంలేని అసలుగారె. క్షీరాన్నం పత్రాగానే ఎన్నడూ

అనగా లడ్డూ పకోడీలు రెండున్నూ సమే కృత్వా అనగా రెండు సమరాసులుగా ఇదేంతో అదంతే చొప్పున చేసి, లాభా లాభౌ అనగా లడ్డూలలో ద్రాక్షలు గాని పకోడీలలో ఉల్లిపాయలుగాని లభించినా లభించకపోయినా, జయాజయౌ నీకు చాలా నయించినా నయించకపోయినా చలించక ఏకగుణంతో ఉండి, తతః తరువాత, యుద్ధాయ అనగా లడ్డూపకోడీ లడాయికి యుజ్యస్వ అనగా తయారు కావోయ్ అబ్బాయీ! నైవంపాపం అవాప్స్యసి అనగా ఇల్లాచేస్తే సిన్న చీమంతైనా పాపం చుట్టుగోడు"—అని.

మాతమ్ముడు—నాకు చాలా చాలా వడ్డించమని అడగడం సిగ్గు అన్నయ్యా!

నేను—అప్పుడు నువ్వు వడ్డించే ఆయనతో, "ఇల్లా ఒక్కరవ్వ విదపడి" అని విన్నట్టో, వేలుపెట్టి చూపించి, వేలు అల్లానే ఉంచి, ఒరిగి పక్కపంక్తిలో ఉన్న ఎల్లయ్యగారితో రాచకార్యం ఉన్నట్టు పెద్దవాక్యం మాట్లాడుతూండు. కావలిసినంతా పడ్డవయినంక గంటు గమనించి, అప్పుడు నవ్వు సరిగ్గా తిరిగి వడ్డించే వాడిమీద తమాషాగా ఖస్సుమను. వడ్డన ఆలస్యం ఎప్పుడేనా అయితే, ధప్పళం ముక్కలు పరామర్శించు. అందుకనే అవి పెద్దసైజులో ఉండడం. వీలైనప్పుడల్లా "రెడ్‌విత్" చేస్తూండు—అనగా మిశ్రమం. ఒకవేళ పచ్చిమిరపకాయ తెప్పించి ఉప్పులో అద్ది కొరకచ్చు. ఆ పనికి పప్పులో పచ్చిమిరప 'రెడ్‌విత్' సాల్టియాట్టు

అంటారు. అల్లానే వప్పు రెడ్ విత్ ధప్పళం! మా ప్రెసిడెంటుగారు ఇల్లాంటి నూతనదాంపత్యాలు అనేకం కనిపెట్టి ప్రపంచానికి కళ్లు తెరుస్తూంటారు! జిలేబీ విశేషంగా తినేటందుకు వీలు ఏర్పడడానికి వారు జిలేబీ రెడ్ విత్—మజ్జిగపుల్స్! అనేది స్వానుభవంమీగాక కనిపెట్టారు. అప్పట్టు మరిచిపోయేరు. చేతికి చాలాజిడ్డు పట్టుకుంటే వీలునుబట్టి కాళ్ళకో గడ్డానికో పట్టించు."

సంగతు

(౧) ఒకానొక జైలులో ఉన్న ఒక ముసలి నేరస్తుని మూసడానికి అనుజ్ఞ కోరుతూ ఆఖైదీపెళ్ళాం దరఖాస్తు చేసింది. అనుజ్ఞ కాలేదు. కొన్నాళ్ళకి ఆఖైదీ యొక్క స్నేహితుడుఒకాయన ఖైదీని చూడడానికి దరఖాస్తుచేసాడు, అనుజ్ఞ ఇచ్చారు, చూశాడు. మళ్ళీ కొన్నాళ్ళకి ఆఖైదీభార్య చూసడానికి అనుజ్ఞకోసం దరఖాస్తుచేసింది. అనుజ్ఞ ఇచ్చారుకారు. మన్లోమనమూట, రెండోసారివెళ్ళి చూసినమొగాడు, ఆపెడేట! వేషం! పగలుట!

(౨)'బొంబాయిలో పగటిచుక్క కనపడిందిట. అది అసలు చుక్కే! తెల్లారకట్ల వచ్చే చుక్కని చాలామంది ఎరుగరు. అసలు తెల్లారకట్లవాళ్ళు అనేది చూడరు. ఆచుక్కకాంతికి సీస ఉంటుంది. అదిసాలుకి రెండునెల్లపై చిలుకు అల్లా పోతుస్తుంది. ఆ కాలంలో అది సూర్యోదయం తర్వాతగుడా కనిపిస్తుంది. ఈ వేళ ౧౦ గంటలకి నేచూశాను' అని మావిలేఖరి వ్రాశాడు. పగటి

చుక్కకి ఇంతపట్టింపు ఎందుకన్నాడు ఒక ద్రావకప్రియుడు.

(౩) 'లాటీ' అనే జంతువుయొక్క జననాభివృద్ధి క్రమాల గురించి రిసర్చిచేసి పర్యవసానం తేల్చడానికి ఒక చోట ఒక కమిటీ పెట్టారు, ఆ కమిటీవారికి పొసగక వారు రెండింటికింద చీలిపోయారు. ఒకరు ఇంగ్లీషునా ఒకరు తెలుగునా ఆలోచించారు. ఇంగ్లీషు ఆలోచనపరులు అన్నదేమిటంటే,

లాటీ అనే దాన్లో ఉంటున్న వస్తుతత్వం కర్ర— అనగా ఇంగ్లీషులో 'వుడ్'! ఆ 'వుడ్' ఉన్న ప్రదేశమే లాటీయొక్క జన్మస్థలం. ఈ 'వుడ్' ఎక్కడెక్కడ ఉందంటే—వెస్ట్వుడ్ బెన్ను అనే పేరుగల ఇండియామంత్రిలోనూ, H. E. ఎడ్వర్డు ఫ్రెడరిక్ లిండ్సేవుడ్ అనే స్వంతపేరుగల రాజప్రతినిధిలోనూ, H. E. బర్డ్వుడ్ -- అనే పేరుగల్గి వెళ్ళిపోయిన ప్రధాన సేనానిలోనూ, ఉంది. ఆమాటకొస్తే H. E. చెట్వోడ్ అనే పేరుగల ప్రస్తుతప్రధానసేనాని పేరులోకూడా చాలాభాగంఉంది

ఇక తెలుగు కమిటీవారలో కొందరు చెప్పిందేమిటంటే, అలా ఈలా కాకుండా సిసలైన తెలుగు "లా" అనేదానికి "టీ" షష్ఠి పరమై వచ్చాడు, ప్రయోగరీత్యా 'లాటీ' సిద్ధిస్తుంది —అని.

మరికొందరు అది అసలు 'లాతీ' గాని 'లాటీ' కాదన్నారు. అనగా లా=లాఅనేది, తీ=తీశెయ్ అని. అంటే సీ లా తీశెయ్‌నా లా తీస్కో అని అన్వయించారు.

(౬) ఒకమునిసిపాలిటీలో ఉండే చాలానూతుల్లో మూడు

నాలుగుమాత్రమే అదృష్టంకొద్దీ బాగుపడ్డాయి. ఎంచేతంటే వాటిల్లో మనుష్యులు పడి చచ్చిపోడం మూలాన్ని నీళ్ళు తోడించేసి, బురదా, మరి లోగడ పడిపోయినవాళ్ళ ఎముకలూ వగైరాలు పైకి లాగించెయ్యడంచేత. తక్కిన వాటిల్లోకూడా ఎప్పుడు మనుష్యులు పడుదురా, ఎప్పుడు అవి బాగు చేయించి పుణ్యం కట్టుకుందామా అని మునిసిపాలిటీవారు శక్తివంచన లేకుండా నిరీక్షిస్తున్నారు. పురుషుల్ని తీసెయ్యండి, స్త్రీలైనా నడుం కట్టి ముందుకి అంగవెయ్యరా అని వారి ఆశ.

(౫) ఓ పట్నాన్ని ఏ ఉద్యోగమూ కాని ఉద్యోగాల్లో, చాలామందికి, అయాచితంగా, వర్ణవివక్షతలు లేకుండా, ఆశ్రయింపులూ, సిఫారసులూ, లంచాలూ లేకుండా అవడం గొప్ప శుభసూచన. ఏవీ అంటే, మన సెన్సస్ ఉద్యోగాలు. కొందరు, ఇంగ్లీషు తిన్నగా రాక పోయినా, 'జనాభాలెక్కలు' అని వాడితే తెలిసిగా ఉంటుందని, ఏ తప్పుడుగానో ఇంగ్లీషే వాడుతూంటారు. 'మీకు సెన్సెస్ ఉన్నాయిటండీ?' అని కొందర్ని అడుగుతూంటే అవతలవారు 'లేవండీ' అంటూండడం విని పిస్తూంటుంది.

(౬) ఆర్. టి. సి. (R. T. C.) యొక్క (అనగా రాజమండ్రీ ట్రైనింగు కాలేజీ కాదు, రౌండు టేబిల్ కాన్ఫరెన్సు) ధోరణి చూస్తే అది మాంచి రసకందాయపుపట్టులోనే జరిగింది. ఆ రసంయొక్క వయినం :—అక్కడికి స్త్రీలనికూడా పిలవడం, అదో శృంగారం. ఒకళ్లు వెడతారనుకున్నది మరొకళ్ళు

వెళ్ళడం హాస్యం. ఒక అఖండుడు మరణించడం కరుణం. ఇండియాకి ఇంకా ఏమిచ్చారో తెలియకుండానే, అంతా ఇచ్చేసేవా అని మేక్డొనాల్డుగారిని చర్చిల్ కంపెనీవారు కోప్పడడం, రౌద్రం. ఇంగ్లండులో అప్పుడప్పుడు లేబరైట్లు చేస్తూన్న ప్రయత్నం వీరం: ఆ సమయంలోనే, కర్మవశాత్తూ కొందరు తీసుకుంటూన్న చర్యలు భయానకం. ప్రజల్లో కొందరిస్థితి భీభత్సం. సైమన్ జట్టు వారి పంచాంగం మూలపడేశాం అని పైకి అని అందులో చెప్పిన ప్రకారమే క్రియలు జరపడం, అద్భుతం. వెనకటించీ ఇండియాలో కోరుతూన్నదీ, ప్రస్తుతం ఇంగ్లండు నించి వారు కోరుతూన్నదీ శాంతం.

(2) ఓ పెద్దమనిషి ఓ అబ్బాయికి ఓ పెళ్ళిసంబంధం తప్పించెయ్యాలని బయలుదేరి, వాణ్ణి నిరసిస్తూ, పిల్ల నివ్వదల్చిన ఆయనదగ్గిర ఇల్లా అన్నాడట :—

అయ్యా! మీరు పిల్ల నివ్వదల్చిన వాడికి 'మెరావకాలాబులా' అనేపాటకూడా రాదు. వాడు గయోపాఖ్యానం ఎరగడు. వాడు తెలుగు క్లాసులోకూడా అల్లరి చెయ్యలేదు. వాడు ముందు ముందుకి మెట్రిక్ప్రైవినింగుకేనా పనికిరాడు. అతణ్ణి రౌండు టేబిల్ కాన్ఫరెన్సుకేనా పంపడానికి వీల్లేదు, చివరికి.

(3) ప్రస్తుతం ట్రేడ్ డిప్రెషన్‌లో ఉన్నాం, అనగా వర్తక మాంద్యం, అంటే డబ్బుకాటకం. దేనికైనా సరే సమాధానాలు చెప్పి పారెయ్యడానికి ఇది ఓ పెద్ద కారణంకింద ఏర్పడింది. ఈమధ్య ఓ కుర్రాణ్ణి "ఏం అబ్బాయి, లేట్ గా వచ్చా

వేం?" అని మేష్టరు అడిగితే, "ఏం లేదండి. గ్రేట్ డిప్రెషన్ గదా!" అన్నాట్ట. మేష్టరు "అప్రస్తుతంగా మాట్లాడక సరియైన సమాధానం చెప్పు!" అన్నాడట. అంటే కుర్రాడు, "నిజమేనండీ, సార్! ఇదివరకు చేతులో డబ్బాడుతూంటే జట్కామీద వచ్చేవాణ్ణి, ఈవేళ నడిచివచ్చాను, లేటయింది" అన్నాట్ట! తనరాబడినిబట్టి చూసి, "డబ్బు కాటకంవల్ల, రోగాలు తగ్గిపోయినాయి" అన్నాడు ఓ డాక్టరు. "రోగాల సంఖ్య తగ్గలేదూ! డబ్బుకాటకంవల్ల రోగాలు ఇంటికగ్గిరే కుదిరి పోతున్నాయి" అని వారి స్నేహితు డన్నాడు. దీనికి కారణం, పదణాలవెండి మాత్రమే గల మన రూపాయే అని కొందరంటారు. కొందరు, అసలు ఈ తెగులు ప్రపంచానికే వచ్చింది, ఇండియాకిమాత్రమే కాదన్నారు. కొందరికి ఈ సంగతి ఇల్లా వస్తుందని అయిదేళ్ళక్రింద టే తెలుసుట, మనతో చెప్పారట, మనం వినిపించుగోలేదు. ఏమైతేం! వస్తువు ఉన్నవాడికోట్టో మట్టి. ఈ మధ్య ఓ ఆయన క్షౌరం చేయించుగుని మంగలాడికి పదహారు కొబ్బరికాయలు ఇచ్చాడు. ఋణదాతలు ఋణస్థుల్ని నిర్భంధించి చేస్తున్నారు. అంచేత ప్రస్తుతం అన్నీ చవక అయినట్టే దివాలాలుకూడా చవక అయినాయి. ఇదివరలో కొన్నిసి వేలకే దివాలాలు గాని, ఇప్పుడు కొన్ని కొన్ని వందలకే. టంకశాలల్లో రూపాయలు కొట్టించి దేశంమీద చల్లిస్తే డబ్బు జబ్బు కుదురుతుంది అని ఒకాయన అన్నాడు. కొందరు,

వెళ్ళడం హాస్యం. ఒక అఖండుడు మరణించడం కరుణాం ఇండియాకి ఇంకా ఏమిచ్చారో తెలియకుండానే, అంతా ఇచ్చేసేవా అని మేక్డొనాల్డుగారిని చర్చిల్ కంపెనీవారు కోప్పడడం, రౌద్రం. ఇంగ్లండులో ఇప్పుడింగు లేబరైట్లు చేస్తూన్న ప్రయత్నం వీరం: ఆ సమయంలోనే, కర్మవశాత్తూ కొందరు తీసుకుంటూన్న చర్యలు భయానకం. ప్రజల్లో కొందరిస్థితి భీభత్సం. సైమన్ జట్టు వారి పంచాంగం మూలపడేశాం అని పైకి అని అందులో చెప్పిన ప్రకారమే క్రియలు జరపడం, అద్భుతం. వెనకటించీ ఇండియాలో కోరుతూన్నదీ, ప్రస్తుతం ఇంగ్లండునించి వారు కోరుతూన్నదీ శాంతం.

(౨) ఓ పెద్దమనిషి ఓ అబ్బాయికి ఓ పెళ్ళిసంబంధం తప్పించెయ్యాలని బయలుదేరి, వాణ్ణి నిరసిస్తూ, పిల్ల నివ్వదల్చిన ఆయనదగ్గిర ఇల్లా అన్నాడట :—

అయ్యా! మీరు పిల్ల నివ్వదల్చిన వాడికి 'మొరామహాలాబులా' అనేపాటకూడా రాదు. వాడు గయోపాఖ్యానం ఎరగడు. వాడు తెలుగు క్లాసులోకూడా అల్లరి చెయ్యలేడు. వాడు ముందు ముందుకి మేష్టరీట్రైనింగుకేనా పనికిరాడు. అతణ్ణి రౌండుటేబిల్ కాన్ఫరెన్సుకేనా పంపడానికి వీల్లేదు, చివరికి.

(౩) ప్రస్తుతం ట్రేడ్ డిప్రెషన్లో ఉన్నాం, అనగా వర్తక మాంద్యం, అంటే డబ్బుకాటకం. దేనికైనా సరే సమాధానాలు చెప్పి పారెయ్యడానికి ఇది ఓ పెద్ద కారణంకింద ఏర్పడింది. ఈమధ్య ఓ కుర్రాణ్ణి "ఏం అబ్బాయి, లేట్‌గా వచ్చా

వేం ?" అని మేష్టరు అడిగితే, "ఏం లేదండి. ట్రేడ్ డిప్రెషన్ గదా !" అన్నాట్ట. మేష్టరు "అప్రస్తుతంగా మాట్లాడక సరియైన సమాధానం చెప్పు !" అన్నాడట. అంటే కుర్రాడు, "నిజమేనండీ, సార్ ! ఇదివరకు చేతులో డబ్బాడుతూంటే జట్కామీద వచ్చేవాణ్ణి, ఈవేళ నడిచివచ్చాను, లేటయింది" అన్నాట్ట! తనరాబడినిబట్టి చూసి, "డబ్బు కాటకంవల్ల, రోగాలు తగ్గిపోయినాయి" అన్నాడు ఓ డాక్టరు. "రోగాల సంఖ్య తగ్గలేదూ ! డబ్బుకాటకంవల్ల రోగాలు ఇంటికగ్గిరే కుదిరి పోతున్నాయి" అని వారి స్నేహితు డన్నాడు. దీనికి కారణం, పదణాలవెండి మాత్రమే గల మన రూపాయే అని కొందరంటారు. కొందరు, అసలు ఈతెగులు ప్రపంచానికే వచ్చింది, ఇండియాకిమాత్రమే కాదన్నారు. కొందరికి ఈ సంగతి ఇల్లా వస్తుందని అయిదేళ్ళక్రిందటే తెలుసుట, మనతో చెప్పారట, మనం వినిపించుకోలేదు. ఏమైతేం ! వస్తువు ఉన్నవాడికోట్టో మొట్టి, ఈ మధ్య ఓ ఆయన క్షౌరం చేయించుకుని మంగలాడికి పదహారు కొబ్బరి కాయలు ఇచ్చాడు. ఋణదాతలు ఋణస్థుల్ని నిక్కచ్చి చేస్తున్నారు. అంచేత ప్రస్తుతం అన్నీ చవక అయినట్టే దివాలాలుకూడా చవక అయినాయి. ఇదివరలో కొన్నిసి వేలకే దివాలాలు గాని, ఇప్పుడు కొన్ని కొన్ని వందలకే. టంకశాలల్లో రూపాయలు కొట్టించి దేశంమీద చిమ్మిస్తే డబ్బు జబ్బు కుదురుతుంది అని ఒకాయన అన్నాడు. కొందరు,

చూస్తూంటేసరి, ధరలు వాటంతట అవే పెరుగుతాయి అన్నారు. అవి "ధర తగ్గుట హెచ్చుకొరకే" అనేది ప్రమాణంగా ఇచ్చారు.

(౯) ఆంధ్రా యూనివర్సిటీ స్థలనిర్ణయం రెండింటితో బయల్దేరి, మూడు మీాంచి నాలుగులోకి వెళ్ళింది. నాయకత్వానికి పోటీ ఇద్దరితో మాత్రమే బయల్దేరింది. ఇదికూడా మాగ్గుర్లోకి వెళ్ళిందా, నలుగుర్లోనూ పడిం దన్నమాటే !

(౧౦) ఒక పల్లెటూరి శాస్త్రుల్లుగారు, పట్నవాసపు చుట్టంతో మాట్లాడుతూ :—

శా—చూడండీ! శారదాభిల్లుకుగారు కులాసాగా ఉన్నట్టా?

చుట్టం—ఆ. ఏం ?

శా—ఆయనది మహాగొప్ప ముందుచూపు.

చు—ఏం ? ఎల్లా కనిపెట్టారు ?

శా—ఆయన అప్పుడు శాసనం చెయించకపోతే, అన్ని పెళ్ళిళ్లు అప్పుడు జరిగి ఉండవు. అప్పుడు గనక జరిగి ఉండకపోతే, ఇప్పుడు, డబ్బుకాటకం మూలాన్ని అసలే జరక్కపోను.

చు—చిత్రం. ఏమిటి సెలవు ?

శా—ఆయన గట్టివాడే !

చు—ఈశ్వరి అనుగ్రహం !

(౧౧) ఇండియాలో డబ్బు కాటకం గురించి ఆలోచించి, సలహా చెప్పడానికి "నాల్టరు" దొరగారు వచ్చారు. ఇంతమంది

ఃడగా 'సాల్టరు' వారే ఎందుకు వచ్చారంటే: ప్రజల్లో
గాదా ప్రారంభం "సాల్టు" తో అయింది గనక ప్రభుత్వం
రు ఓ డిగ్రీ పైన ఉండడానికి "సాల్టరు" గారిని పిలిపించాడు.

(౧-౨) షణ్ముఖం అనే ఆయనకి ఈమధ్య లాటీ దెబ్బలు
లాయిట. అతనిమీద పోలీసువారు అక్రమ సంఘం (అన్
ఫుల్ ఎస్సెంబ్లీ) నేరం మోపారట. అతడొక్కడే ఉన్నాడని
లీసువారు కూడా ఒప్పుకున్నా, అతని పేరులో అయిదుకంటే
ఎక్కువ ఉంది గనక అతనిమీద ఆ కేసు పెట్టవలసొచ్చిందని
లవిచ్చారట.

ద్యార్థుల ఏకాంతపు రిమార్కులు

కొంతకాలం కింద ఒక వేసంగిలో ఆంధ్రదేశపు కాలేజీ
ద్యార్థుల సమావేశం మహాపురంలో జరిగింది. ఒక పెద్దభవనం
దకి మాట్లాడి దానిచుట్టూ పందిళ్లు వేశారు. చాలమంది
చ్చేశారు. ఉన్న తాదర్శ్యాలతో భోజనవసతి ఏర్పాటైంది.
ట్రెండెమ్ముల విద్యాలం గురించీ, పరీక్షల నాశనం గురించీ,
సిరకపు మేష్టర్లని తీసెయ్యడం గురించీ, కొత్తైన తీర్మానాలు
మోదింపబడి గ్రంథస్థం చెయ్యబడ్డాయి. రాత్రెళ్ళప్పుడు
ందెళ్ళక్రింద చాపలేసుగుని విద్యార్థులు గుంపులు గుంపులుగా
ి ఇష్టాగోష్ఠి మాట్లాడుకుని వదుకుంటూ ఉండేవారట.
గా సన్నిహితుడైన ఒకవిద్యార్థి ఆ వయినాలు యావత్తూ

చెప్పిన మీదట మాకు తెలిసింది. కొందరు అశ్లీలాలే మాట్లా
డుతునే వారట. అవి మినహాయించేశాం. కొందరు నిందా
వాక్యాలే అంటూ ఉంటారట. అవీ విడిచిపెట్టాం. ఒకచోట మాత్రం
చదువుగురించే ముచ్చటిస్తూ, అధ్యాపకుల ప్రత్యేకత్వాలు
స్థాపించే లక్షణాలు చెప్పుకుంటున్నారట. అధ్యాపకుల్లో
ఎవరూ అప్పుడు అక్కడ లేకపోవడంవల్ల ప్రతీ వాడూ దాపరికం
లేకుండా మనస్సులో ఉన్నది అనేశారుట. వాళ్ళ తమ సంభా
షణల్లో యథాలాభంగా ప్రయోగిస్తూండేటన్ని ఇంగ్లీషు
ముక్కలు ప్రయోగించకుండా ఆ భావాలు మాత్రం గమనిస్తే,
ఈ క్రిందిమాదిరిని ఉంటాయి :—

ఒకడు—హారిబుల్ అని ప్రిన్సిపాల్తో మొదలెడదాం.

రెం—నిజమేనండీ. మా ప్రిన్సిపాలు గవర్నరులా ఉంటాడు.

మూ—సరె! మా ప్రిన్సిపాలు మట్టివిఘ్నేశ్వరుడులా
ఉంటాడు. ప్రిన్సిపాలు వద్దు పెద్దవద్దూ! ఆ వద్దు చివరకి అట్టే
పెట్టి ముందు కదంబి కొట్టేద్దాం.

నా—నూరా ఫిలాసఫీ మేష్టరూ......

రెం—ఇంకా ఇల్లేనా అలక్కుండా మొదట్లోనే శుభమల్లా
ఫిలాసఫీ ఏమిటయ్యా! కొంచెం శాంతించి వ్యవహరించు. అసలు
ఫిలాసఫీ ఓ గ్రహపేరా పులిహోరా ఒక పిండివంటేనా! చివర
చివరకి ఫిలాసఫీ!

నా—మీరు ప్రతీదీ విలువునా చీరి అడ్డంగా నరికేలా
ఉన్నారే! మీరే కానివ్వండి,

రెం—మా సైన్సువేష్టరు బి. యే. ప్రెసిడెన్సీ ఫస్టు.
గా ఎం. యే.! ఆచరణాభాగంలో ఆయన సధ.
ౕన అరచేతులు అరిగి ఉన్నాయి. ఆయనకి మిఠాయి
ఖలు కష్టం. ఉండ పళంగా నోట్లో వేసుకుని నొక్కడం
నికి అలవాటు. తద్వారా, ఆయన, ప్రశ్న ప్రెస్సు
ంచి ఏదో ఒక విశేషం కనిపెట్టాడు. అందుకు ఓ కంపెని
ప్ప ఆయనకి ఓ పాతిక వేలు పారేశారు.

అ—మా వాడూ వచ్చి ఒక పుస్తకం తీసి తెగ చదువుతాడు.
ంట వేరే స్వంతముక్క ఊడిపడదు. కుర్రాళ్ళకేసి
స్తే ఆయనకి భయం, బోర్డుకేసి తిరిగి ఉన్నప్పుడు
ర్యం.

ఆ—మావాడికి తెలుగు రాకపోవడంవల్ల ఎవడైనా
ంగుని మాట్లాడితే తన్ను తిట్టడంఅనుకుని ఫైన్ తగి
వేస్తాడు. సైన్సుడిపాజిటు కిందకట్టిన మూడురూపా
ు ధరావతూ మొదటి మాసంలోనే చాలామందికి
రు.

మొ—మా సైన్సువేష్టరు ప్రైవేటుక్లాసులు. తిను
ధపడి ఇంకోన్ని బాధపడితేగాని ఆయనకి తోచదు!
క్క ఘట్టంలో చెబుతూన్న అంశం కుర్రాళ్ళకి తెలి
దు. ఆయనకీ తెలియదు. ఏవన్నా అంటే 'నాకు
ర్కం కంఠతా వచ్చును. రాసినవాడికి కూడా ఇంత

మ—మా మేష్టరు సాధారణంగా క్లాసుకి రాడు. వర్గా! పాఠం చెబుతున్నా చుట్టకాల్చడం మానడు. అయితేం, కొన్ని మాసాల్లో మామూలువాళ్లు చెప్పే విషయం అంతా ఒక్క లెక్చర్లోనే మళ్ళీ చూడక్కర్లేకుండా చెప్పేస్తాడు.

అ—మా వాడికి ఆక్షేపణలులేవు. ఉన్నదిమాత్రం అంత అద్భుతంగా ఎవ్వడూ చెప్పలేడు. ప్రాక్టికల్ లో వస్తువులు మాత్రం స్వంతాస్తిలా చూసుకుని నల్లపూసంత రాలనిస్తూ ఉంటాడు.

ఆ—మా మేష్టర్ని ఈమధ్య బదలాయించేశారు. వెంటనే మాకు శాస్త్రపాఠాలు సుగమం కావడం ప్రారంభించాయి.

నా—మా లెఖ్ఖల మేష్టరు చదరంగంలో ఘట్టు. అట్టెం డెన్సు తణిఖీ చెయ్యడు. కుర్రాళ్ళకి లెక్క ప్రయత్నించ డానికి యిచ్చి ఆకాస్త వ్యవధిలోనే సరికొత్త ఇంగ్లీషునవల చదువుతూంటాడు. అతడు వేసిన లెక్క రాకపోవడం ఎవ్వరూ ఎరగరు. ఏదేనా చిక్కు లెక్క అంతగాగాని పేచీపెడితే ఒక్క పొడుంపట్టు పీల్చేసరికి ఆన్సరు ఊడి పడిందన్న మాటే!

ఏ—మా మేష్టరు బుక్కులో లెఖ్ఖలు నాలుగు బాగా రుక్కేసుకువస్తాడు. అందులో వోటి నిమ్మళంగా బోర్డు మీద రాయబోతూండే సమయానికిగాని ఎవడేనా కా

...స్తేమో, కోప్పడి, ఆ కుర్రాణ్ణి ఇంటికి పొమ్మంటాడు. ...చేత ఎవడేనా కుర్రాడు ఇంటికి పోవాలంటే ...స్తే సరి.

ఆ—మా మేష్టరు తను చెప్పే లెఖ్ఖ ఏ పేజీలో ఉందో ... పేజీలో వేళ్ళో పుస్తకం పట్టుగుని వస్తాడు. రేఖాగణితంలో ...మ్మ వెయ్యడానికి పుస్తకం బల్లమీద బోర్లిస్తాడు. ...ర్లించకుండా మామూలుగా పెడితే గాలికి పేజీలు తారు ...మారైతే మళ్ళీ పట్టుకోడం కష్టం. బొమ్మ వేస్తాడు. ఎవరేనా ...కు తెలియడం లేదండీ' అంటే 'నాకూ తెలియడం ...నోయ్, చిత్రంగా లేదూ! మా గొప్ప లెఖ్ఖ!' అంటాడు. బొమ్మలో ఎవడేగీతలు ప్రతిపాదిస్తే ఆగీతలు గీస్తాడు. ...మత్తం మీద, బొమ్మ, పచ్చీసు గళ్లలా తయారై గంట ...పూర్తవుతుంది. కాని, ఏది ముఖ్యం అంటాడో అదే పెద్ద ...ప్షలో వచ్చి తీరుతుంది.

అరు—మా వాడు మన్మథ విగ్రహం. ఇంగ్లీషు మాట్లా... గంటకి 60 మైళ్ళ రేటు. వస్తూనే, పుస్తకంలో ఏదో పేజీ ...ద్యమని, ఒకటో లెఖ్ఖ చప్పరించి, రెండోది చూడమని, ...మూడోది తను నోటంట అంటూ నాలుగోది బోర్డుమీద ...సి అయిదో లెఖ్ఖ ఆధారంవల్ల, ఆరో లెఖ్ఖ ఆన్సరు నోటిని ...ప్పమంటాడు. కుర్రాడు ఏడవాలి. లెఖ్ఖల మాట అలాఉన్నా ...ని, మనిషీ మాటా చాలు, కడుపు నిండుతుంది.

పిల్లినడక ! వికారంగా చుట్టినా అందగా ఉండే తలపాగా ! ఇంగ్లీషు మాట్లాడ్డం నేర్చుగోడానికి దొర్లు ఆయన్ని ఆశ్రయించాలి. అంతగుచ్చుకునే చూపు ఎక్కడా ఉండదు సింహం చూపు! పాఠం తయారీలేని రకాలకి గంటంతా తలవంపే. ఓ గంటఆయన చెప్పడం వింటే ఆరుగంటలు విడిగా ఇంటిదగ్గిర కూచుంటేగాని విన్నసంగతులు తెలివిగలవాడుకూడా హరాయించుగోలేడు. తొణకడు. తిడుతూన్నా దీవిస్తూన్నా మొఖంలో మార్పు ఉండదు. ప్రజ్ఞ అమోఘం. శాస్త్రం ఆయనికి వ్యాక్యవిలి. హృదయం నవనీతం. తూలనాడ్డం ఎరగడు. కాని చంపేస్తాడని అందరికీ భయమే. బ్రహ్మరుద్రుల్ని లక్ష్య పెట్టడు.

మూ—మాహిస్టరీ మేష్టరు దొరలాగ టీక్ గా ఉంటారు. దొరసాన్ల సరసనికూచుంటే ఆయన్ని దొరే అనుకోవాలి గాని గత్యంతరంలేదు. ఆయన ఇంగ్లీషు ఎం. యే. కి అయిదుసార్లుకట్టి ఫేలై విసిగెత్తి చివరికి హిష్టరీకి కట్టి లటక్ మని ప్యాసయారట. పెదిమి కదలకుండా మంచి ముత్యాలు రాల్చినట్టు పదాలు దొర్లిస్తూ, హిస్టరీ వృత్తాంతం ఈపణ్ణాల్రీమూ లేసి అఖండవాక్యాలు అనేస్తాడు.

మొదటి—మా మేష్టరు, కర్మవశ ! నోట్సునోట్సు నోట్సు నాటికి అంతూ ఆఖరూలేదు—ఒక్కొక్కప్పుడు దారీ తెన్నూ ఉండదు. ఇక్కడికి ఆయన్నొక్క రెండు బుక్కులు అయి

ణిక్షచేసి, తను ఓ పెద్ద బైండుబుక్కులో నోట్సు రాసు
కున్నారు. అందులో ప్రతీరోజూ లెక్చరు ఆఖరుకాగానే (లెక్చ
రంటే డిక్టేషనే—ఆయన డిక్టేటరే!) ఆ తారీఖేసి సంతకం చేసు
కునేవాడు, నిరుడు ఆ తారీఖున సంతకం ఎక్కడుందో, ఈయేడు
కూడా సరిగా అక్కడికే అయి అక్కడే సంతకం పడాలి. ఎక్క
డైనా నిరుడు చమత్కరిస్తే, ఈ యేడు కూడా అక్కడే చమత్క
రించడం కూడా నోట్సే! లేకపోతే నాలిక తెంపుకునేవాడు.
మాటు మాకు రాళింటే రోతపుట్టి ఆయన తాలూకు పెద్ద
బైండులాగేసి దాచేశాం. దాంతో మాకు వారం రోజులు
సెలవొచ్చింది.

నా—మా మేష్టరు పిడుగు! దేశాన్నిబట్టి చరిత్ర చెప్ప
టకపోక, కాలాన్నిబట్టి చెప్పేస్తాడు. ప్రతీవారం కుర్రాళ్ళకి
రపారమే. బుద్ధాయిల్ని దిప్పునరిగేస్తాడు.

అయి—మా హిస్టరీ మేష్టరు ప్రిన్సిపాల్ని ఠకాయిస్తుంటా
డు. ఓమాటు ప్రిన్సిపాలు వెళ్ళి ఏదో క్లాసుకి ఆయన్ని
ప్రైం డెన్సు వెయ్యమన్నాడు. ఈయన 'అది నా పనికాదు'
పక్కకి తిరిగి జవాబు చెప్పాడు. ఈయన రోజూ ప్రిన్సి
లేక పోలీసులో లాగ అవసరమాత్రంగా గుడ్ మార్నింగ్
చెప్తూంటాడు. ప్రిన్సిపల్ ఓనాడు మా మేష్టరు దగ్గిర కెళ్ళి
మందలించి తనేమీయడు 'గుడ్ మార్నింగ్' అన్నాడు. తరవాత
రోజూ ప్రిన్సిపాలు బండీమీద వస్తూంటే, ఈయన వెళ్ళి,

మార్నింగు పెట్టి, ఒకటి, రెండు, మూడు (అన్నట్టు అభినయించి 'చాలా? తృప్తి అయిందా? ఇదేనా నమస్కారం పెట్టేరీతి! అన్నాడు. దాంతో మరి ప్రిన్సిపల్ ఆగిపోయారు.

మూ—మా ఇంగ్లీషుమేష్టరు వచ్చేసరికి సాధారణంగ డబడబళ్లం జరుగుతుంది. ఆట్టెండెన్సు వెయ్యగానే కుర్రాళ్లు కిటికీల్లోంచి దూకి పాకి జారి సన్నగిల్లి శాల్లాచేతులా అవతల పడిపోతారు. నేనోమాటు, ఆయన తన పాఠం మొదలెట్టిం తరవాత, 'నేను ఒకసారి బయటికి వెళ్ళాలండి' అన్నాను ఆయన సరే అన్నాడు. నేను ఆ రోజుకి మళ్ళీ రాలేదు. మర్నాడు 'నువ్వు మళ్ళీ నిన్న రాలేదే!' అని రాగానే అడిగాడు. నేను మళ్ళీ వస్తానని చెప్పలేదు అనేసి మూడ్చేశాను.

నా—మా యింగ్లీషుమేష్టరు వాక్కు మంచినీళ్ళప్రవాహం నాలుగు గొంతికలు పలికిస్తాయి. బ్రహ్మాండివాడు. ఒక్క ముక్క బోధపడదు.

అ—మా మేష్టరు ఊహాలాగ్రేసరులు. ఇంగ్లీషు ఏమీ బాగుండదు. అభిమాన పదాలన్నీ బజారుసరుకు. మాట్లాడుతూంటే కూడా ఆయనకి స్పెల్లింగు తప్పలే. చాలా కొంచెమే రానుగోమంటాడు, అది బంగారమే.

రెం—మా మేష్టరు ఆవలింతలు. చాలానుస్తీ. వాక్యం పూర్తి అయేసరికి కర్త మరిచిపోతాం. అసలు ఒక వాక్యం పూర్తిచేసేలోపల ఉమ్మెయ్యడం తప్ప కడం పనులన్నీ నాలికతో చేసేస్తాడు. దబ్బప్రశ్నలు పరీక్షముందు, ఆన్సర్లతో

పహా మా చేత రాయిస్తాడు. అవి తప్ప కదలంపి పరీక్షలో సిద్ధం అవుతాయి. కాని, ఆ సంగతి పరీక్ష తరవాత గాని తెలుస్తూండదు.

నా—మాకు ఇంకో మేష్టరున్నాడు. ఆయన సహస్రాక్షుడు. ఆ సంగతి నాకు తెలియక నేను ఓనాడు ఆయన పాఠం మొదలెట్టగానే వెళ్ళిపోతానని అభినయించాను. ఆయన, 'ఆ అభినయం ఏమిటి?' అన్నాడు. లెక్చరుకి అడ్డం రావడం ఎందుకని అల్లా చేశానన్నాను. ఆయనకి కోపం వచ్చింది. మర్నాడు క్లాసులో నా గది తలుపు గాలికి కొట్టుకుంటూంటే ఆయన దాన్ని బిగించమని నాకు పని చెప్పాడు. ప్యూన్‌తో చెప్పండి అన్నాను నేను. 'నువ్వు నా డ్రాయింగ్ ఒక్క కిటుకుతో, తెలుసునా? సిగ్గు పోగొట్టేది నేనే!' అన్నాడు. నాలుగోటి నేను ఆ తలుపు బిగించి రావడమే కాకుండా కదలంచి అక్కడే కూర్చొచ్చాను, ఎందుకైనా మంచిదని.

ఐ—మా ఇంగ్లీషు మేష్టరు భాష ఆంగ్లసారస్వతంలో కల్లా విన్నూ.

ఆరు— మా మేష్టరికి నేనోసారి బైబిలూ పాత రికార్డులూ బహుమతి తీసికెళ్ళనరికి తరుంకొచ్చాడు.

మొద—మా ఇంగ్లీషు మేష్టరు ఇంగ్లీషు లెక్చరంతా తెలుగునే కానిస్తాడు. ఆయన ఇంగ్లీషు మాట్లాడుతూంటే తెలుగులా ఉంటుంది, తెలుగు మాట్లాడుతూంటే ఇంగ్లీషులా ఉంటుంది. ముఖం ఒక గ్రంథం, నాలిక ఒక ఘంటం

అన్నంత గ్రాంథికభాష ఆయనకిష్టం. కుర్రాళ్ళని అప్పు డప్పుడు మందలిస్తూంటాడు. ‘మీనాన్న పంపిన మనీ అల్లా ఎందుకు బరన్ చేస్తావ్ అబ్బాయి!’ అన్నాడు ఓ కుర్రాణ్ణి. ‘మనీ ఆక్సైడ్ అనే భస్మం తయారు చెయ్య డానికండి’ అన్నాడు వాడు. ‘ఇందులో ఉన్నాయి మన తెలివితేటలు. ప్రిన్సిపల్ నేటివ్ అయినంత మాత్రాన్ని నువ్వు లెక్చరర్లని ధిక్కరించడం పనికిరాదు’ అన్నాడు. ఇంగ్లీషునాటకం బోధించే సమయంలో ఎక్కడేనా గొప్ప వాక్యాలు వచ్చినప్పుడు ఆయన ఆ వాక్యాలు దొరకి పుచ్చుగుని వ్యాఖ్యానం చెయ్యలేక, ఆ వాక్యాలు చదవడం మాత్రం చదివి సులోచనాలుతీసి బల్లమీద పారేసి, ‘అద్భుతమైన భావాలు, అఖండమైన ఆలోచన! మరి తరవాతి పంక్తులు చూద్దాం’ అని ముందుపంక్తులు చదువుకు పోతాడు.

రెండు—మా తెలుగుమేష్టరికి ప్రిన్సిపల్ అంటే హడల్! ఆయన రాగానే కుర్రాళ్ళు తలుపులు వేసేస్తారు. కుర్రాళ్ళని రావాకులా కూచోమని వాళ్ళకంటె గోలగా మాట్లాడు తాడు.

మూడు—మా మేష్టరు అయిదు నిమిషాలు పాఠం చెప్పి ఆ కాసిమిషంలో తను రాసినపుస్తకం దగ్గరికి వస్తాడు. ఆయన రాసిందకూడా అదొకటే. ఎవడో ఒకడు అందులో పద్యం ఓటి తీసి దాని అర్థం తెలియ చెప్పమని ఆయన్ని

ప్రార్థిస్తాడు—బతికున్న వాళ్ళలో ఎవరికీ తెలియకుండక. ఆయన సగం చెప్పి, 'అప్పుడు దేవి వ్రాయించినది. వ్రాసినాము. ఇప్పుడన్నానో!' అనేస్తాడు. ఆయన పేపరు దిద్దితే అంతా వ్యాసే. ఓసారి ప్రిన్సిపాల్ 'పరీక్షంటూ పెట్టేం తరవాత నూటికి కనీసం పదేనా వేలవద్దా!' అన్నారట. అక్కణ్ణించి ఆయన పేపర్లు దిద్దేటప్పుడు పదోది, ఇరవైయోది, ఇల్లాగ్గా ఫేలుచెయ్యడం ప్రారంభించాడు. అందుకని, కుర్రాళ్ళు వారింటికెళ్ళి తమ పేపర్లు పదీ ఇరవై యీ ఇల్లాంటిస్థలాల్లో లేకుండా ఆయనచేతే సర్దించుతారు.

మూ— మా మేష్టరు ఒక్కొక్కడికి తెలుగులో 39·9 మార్కులేసి పరీక్షకి కట్టకుండా ఆపుచేయిస్తాడు. ఆకాస్త వెయ్యండీ పరీక్షకి కట్టేస్తానూ అని కుర్రాడు అడిగితే, 'నువ్వు తక్కిన ·1 కి అనర్హుడవు' అంటాడు.

నా— మా తెలుగు మేష్టరు తిట్టి చంపుతాడు. పైగా పేపరిస్తాడు. మాట్లాడితే ప్రమాదం. ఏ కవినీ ఒప్పుకోక ప్రతీదీ నేల్నెట్టి కొడతాడు.

అ—మా మేష్టరేమిటో తెలుసునా? సాయంత్రం వెళ్ళి అప్పెండిస్సు వెయ్యమంటే, 'ఊళ్ళో ఉన్నావ్ గా, నీ కెందుకీ శ్రమా! కాకిచేత కబురంపితే వేసెయ్యను టోయ్!' అంటాడు.

ఆరు— మీ పుణ్యంగనకా! మా మేష్టరు దేన్ని

గురించి ఎవరిమీద అనుమానపడ్డా అందరికీ అప్పెండిక్సు కత్తిరిస్తాడు, పేపరిచ్చి పరీక్ష గోకేస్తాడు.

మొ:—చివరచివరకన్నా రుగనక, మరి ఫిలాసఫీ. మా మేష్టరు నిదానంగా కూచుని, కుర్చీ అంచుమీద మెడ పెట్టి, అద్భుతమైన శైలిలో, దుర్భేద్యంగాఉండే అంశం పట్టుగుని, తనకంటె బాగా, వినేవాళ్ళకే, ఇదివరకే అది తెలుస్తునా అనిపించేటంత సుబోధకంగా, దేనికది విడగొట్టి చెప్తాడట. ఆయన దగ్గిర వినడాలేగాని రాసుగోడాలు లేవుట. సంగతులు మరచిపోడాలూ లేవుట. కడంవిషయాల వాళ్ళు 'మేం ఫిలాసఫీయేనా తినుగున్నాం కాదుగదా, ఈయన్ని వినడం పడడానికి!' అని బాధపడుతూంటారు. మా ప్రిన్సిపాల్సు!

రెం—నా ప్రిన్సిపాల్కి ఏమీ అక్కర్లేదు. ఇల్లూ కాలేజీయే ఆయనలోకం, సెలవు సాధారణంగా యివ్వడు.

మూ—మా ప్రిన్సిపాల్ ఏక ఆటలు.

నా—మా ప్రిన్సిపాల్ కొంచెం టెన్నిసు ఆడతాడు. కాని, టెన్నిస్ బాగా ఆడే కుర్రాళ్ళని చూస్తే కోపం. డైరెక్టరువచ్చి ఓమాటు టెన్నిసు ఆడదాం అన్నాడు. నేనూ డైరెక్టరు ఓవేపూ, మా ప్రిన్సిపాలూ ఇంకో మేష్టరూ అవతలవేపూ! తప్పనిసరివల్ల మా ప్రిన్సిపాల్ నన్నప్పుడు ఆడనిచ్చాడు. నేను ఒక్కస్మాష్ ఈడ్చి కొట్టాను. అది ప్రిన్సిపాల్కి తగల్లేదుకాని, అది ఆయన

తిప్పబోయి పడ్డాడు. కాలు రాచుకుపోయింది. నేను అది పొగరుతో కొట్టాననుట, మర్నాడు నా ఫ్రీస్కాలర్‌షిప్పు ఊడదీసేశాడు.

ఆ—మా ప్రిన్సిపాల్‌కి అన్నీ కావాలి. కలకలలాడుతూంటే తీరిపోనా! నిత్యమూ కోడంటికం యాగీనూ! ఎప్పుడూ పరీక్ష గోలా, మార్కుల రోదనమున్నూ! సున్నావస్తే పూజ్యుడంటాడు, కటాకటీగా మార్కులొస్తే ఇటూ అటూకాని గబ్బిలం అంటాడు, బాగావస్తే 'ఇంకా బాగా వస్తాయనుకున్నాను, నీకు పొగరు' అంటాడు. ఏమిఅన్నా అనకపోయినా ఫైనే. నాటకపు రేట్లలాగ ఫైన్ రేట్లు కట్టేసి ఉంటాయి. పైగా 'సమయానుకూలముగా రేట్లు హెచ్చింపబడును.' నేను వెళ్ళిన కొత్తకం క్లాసులో ఆయన నన్ను ఏదో ప్రశ్న అడిగాడు. ఏదో పెద్దవాడు ప్రశ్న అడిగాడు. కాస్త పెద్దమాటతో సమాధానం చెబుతే దర్జాగా ఉంటుంది, పై పెచ్చు క్లాసులో కడంవాళ్ళకి నాయందు కొంత భయమేనా ఉంటుంది, అనుకుని, 'రొ డజ్ వుజ్' అనేమాట నా ఆన్సరులో దొర్లించాను. అది 'రెండవూ!' అని పలకాలట, నాకు ఉచ్చారణలో రెండుతప్పు లొచ్చాయిట, అందుకని నాకు రెండురూపాయలు వొడ్డించాడు. ఆ జరిమానా రశీదు మర్నాడు చూపెట్టమన్నాడు. మర్నాటికి అదికొంచెం చిరుగుపట్టింది. 'ఎంత అశ్రద్ధ నీకూ!' అని మళ్ళీ రూపాయి తగిలించాడు.

ఆ—మా వాడు ఎన్నికాంపోజిషన్లు తెచ్రాడు రాయడో

అర్ధరూపాయలు ఇచ్చెయ్యమంటాడు. చేరడానికి వచ్చినవాడొకడు 'ప్రిన్సిపాలు' అని ఉన్నచోట పొరపాట్న సంతకం చేస్తే, రూపాయి ఫైనేసి కొత్త దరఖాస్తుఫారం ఇచ్చాడు.

ఏ—మా ప్రిన్సిపల్‌కి చాలాజాలి. ఎవరెప్పుడొచ్చినా చేస్తుకుంటాడు. పరీక్షకి కట్టించకపోవడం అంటే ఆయనకి మంట. డబ్బిచ్చి చదివినప్పుడు పరీక్షకి కూచోడం జన్మహక్కని ఆయన వాదన. మొత్తంమీద ఆయన అధికారి. కాలేజీ అనాథశరణాలయం, చిలక్కొట్టులకి స్వస్థలం.

ఐ—మా ప్రిన్సిపల్ బిక్షలతంత్రులైన విద్యార్థుల్ని కూడా, కుంకా, మూర్ఖా, అంటాడు.

మూ—మావాడు మేం ఏం చెబితే అది. మొప్పర్గ మాట ఖాతరీ చెయ్యడు.

ఆ—మా ప్రిన్సిపాలు అంతా యంత్రవతు. నాలుగింటికి-నవ్వు—అని కార్యక్రమం వేసుకుని అప్పుడే నవ్వుతాడు. నాలుగున్నరకి ఏమవు, అంటే, అప్పుడే. దుష్టుడు మాత్రం కాడు. పైకి యముడు. తనవాళ్ళమీద ఈగ వాలనివ్వడు.

నా—ఒక్కొక్కప్పుడు మా ప్రిన్సిపల్ మాటే అద్దు-అప్పుడు మాకు మరీభయం.

ఎని—మా ప్రిన్సిపల్ అవతారం! చదివితే యమచదువు, తింటే రావణాతిండి, రాస్తే మైరావణ రాత. అంతా విపరీతం. కుర్రాళ్ళకి ఎంతకోపం వస్తే అంత సహించే మాటకారి. ఆయన పారం తయారీ ఓమాటే చేసేశాడు. చాలావసుండి

పుస్తకం ఎంతమాత్రం చూడకుండా వచ్చిననాడు ఆయన మాటలు మరీ రత్నాలే! మహానుభావుడు! మనిషిలో ఏకోశం చూసినా అది ఒక పెద్ద పుస్తకాల బీరువా అన్న మాటే! జేబులో చెయ్యిపెట్టి చేతికెన్నిరూపాయ లొస్తే అన్నీ కూడా దరిద్రుణ్ణే అన్న విద్యార్థి ప్రతీవాడికీ ఇచ్చేస్తాడు.

రెం— } నిజమే! నిజమే! మహానుభావులు!
మూ— } రకరకాలు! ఇక కనుకుదాం!

[ఈ పైనఉన్న 'విద్యార్థుల ఏకాంతపు రిమార్కులు' అనే విషయాన్ని గురించి మరిరెండు మాటలు. 1897, 1905, 1918, 1927 సంవత్సరాల కాలాల్లో వివిధ కాలేజీల్లో చదివి బియ్యే పరీక్షకి వెళ్ళిన పలువురు విద్యార్థుల జ్ఞాపకాన్నిబట్టి బాగుచేసినమీదట, పై సంభాషణ 1931 లో రాయబడింది. విశేష సారస్వతజ్ఞానంతో పాటు సరళమైన పరతత్వజ్ఞానం కూడా కలిగి సుప్రసిద్ధులైన ఒకానొక కాలేజీ ప్రిన్సిపాల్‌గారు తనని గురించీ తన సహాధ్యాయుల్ని గురించీ తన విద్యార్థుల్లో కొందరు ఏకాంతంలో ఏమనుకుంటూంటారో ఎట్లానో తెలుసుకుని, ఇది విన్న విద్యార్థులకి కొంచెం గిలిగిలిగానూ సహాధ్యాపకులకి కొంచెం హెచ్చరికగానూ ఉండే లాగున, ఆ మాటలు తనే విద్యార్థులందరికీ పబ్లికుగా క్లాసులో చెప్పి ఉండడం నాకు తెలుసు. ఆయన చేసి ఉన్న అప్పటి ప్రసంగం గురించిన జ్ఞాపకమే ఈ సంభాషణకి మూలం.

అయితే, ఇది ఆర్ట్సు కాలేజీలో పూర్వవిద్యార్థి సంఘంతాలూకు ఉత్సవ సభలో 24—1—31 నాడు నేను చదివేటప్పుడు కొంచెం దుమారం లేగింది. ఆ రోజు కార్యక్రమంలో, నారచన చదవడానికి నన్ను అసలు ఆలస్యంగా పిలిచారు. కడంది కొంత గబగబా అనేసి కొంతసేపటికి ఈ ఘట్టంలోకి వచ్చాను. అప్పట్లో ప్రిన్సిపాల్‌గారు శ్రీశ్రీ చక్రవర్తిగారు. ఇందులో పదిపన్నెండు వాక్యాలు నేను చదవగానే, మరి ఆపు చేయించ

వలసిందని వారెళ్ళి అధ్యక్షులైన శ్రీశ్రీ గంటి లక్ష్మన్నగారిని కోరారు అయన, వెంటనే ఏ ఆజ్ఞాఇయ్యలేదు. ప్రిన్సిపల్‌కి ఎందుకో ఏదో కోపం వచ్చి ఆపెయించమంటున్నారని జనమంతా అనుకున్నారు. జనంతో పాటు నేనూ అనుకున్నాను. ప్రిన్సిపల్ గురించి ఉప్మాడిగా రెండువాక్యాలు సంభాషణకి మొదట్లోనే రాకడం అగడటిడకి కారణమేమోఅని నాకూ అనిపించింది. దానికి తగ్గట్టే అప్పుడు సభలో ఇద్దరు ప్రిన్సిపల్సు ఉన్నారు. సరే, రెండు ఉపమానాలూ చెరోటీ సరిపడేలాగ నేను అప్పటికప్పుడు తెచ్చానని అంతా అనుకుంటూ ఉన్నట్టు కనిపించింది. అందువల్లే శ్రీశ్రీ చక్రవర్తిగారు కోపంలో పడిపోయి సభఆపించేయాలని పట్టుపట్టుతున్నారని సభ్యులు సంకల్ప పడ్డారు అన్నట్టుగా, జనం అంతా వారికేసి చూడడం, ఈ సంభాషణ చదివే నిమిత్తం నాకు ఇంకా టైం ఇప్పించవలసిందని అధ్యక్షుల్ని అడగడం, 'గో ఆన్ ప్లీజ్' అని నాతో కేకలెయ్యడం సాగించారు. నేను సమస్యలో పడ్డాను. అధ్యక్షులు నాకు కొంత వ్యవధిఇస్తూ, త్వరగా ముగించమని ఆజ్ఞ ఇచ్చారు. నేనూ ఆ వ్యవధి ఉపయోగించుగోవాలని తొందరపడుతూండగా, ప్రిన్సిపాలుగారు అధ్యక్షుల దగ్గిరికి వెళ్ళి మళ్ళీ ఫిర్యాదుచేశారు. ఆ ఫిర్యాదు నా మీదే అయిఉంటుందని అందరికీ తెలిసింది. దాంతో అధ్యక్షులు నన్ను ఆగిపొమ్మన్నారు. నేను తక్షణం అధ్యక్షులమాట శిరసావహించి సభవారికి నమస్కరించి, వేదికదిగి ఎదరకి నిష్క్రమించబోతూ, వెనకాల ఉన్న శాస్త్రప్రయోగశాలలో నేను విడిచివచ్చిన చెప్పులమాట జ్ఞాపకంవచ్చి వెనక్కి వెళ్ళబోతూంటే, శ్రీశ్రీ చక్రవర్తిగారు, "వీడు మళ్ళీ ఏదో ఇంకా చదవడానికే వస్తున్నాడు గావును" అనుకున్నారు గావును, వెనక్కి రావద్దు అన్నట్టు చెయివిదిల్చి నాకు సంజ్ఞచేశారు. ఆయన చెయ్యి విసురు అంతాకూడా గమనించారు. ఆయన దగ్గిర నేను చదువుకునేటంత భాగ్యంతో పుట్టకపోయినా, వార్ని 'మీా శివరండి నన్నవడానికీ' అంటూ డీకొనక, వారి పెద్దతనం మన్నించి దిగి పోయాను. దాంతో ఆ సభ మాంత్తుగా ఆగిపోయింది.

అసలు సంగతి తరవాత తెలిసింది! ఎప్పుడూ అంతే! అయనకి

కోపమూ కాదుట, మరోటీ కాదుట! అసలు ఆయనకి అప్పట్లో నేను చదివిన తెలుగుముక్కలు తిన్నగా అర్థమే కాలేదుట! ఆయన ఆ రోజున సరిగ్గా ఎనిమిది గంటలకి ఖరీదైన విందు ఒకటి స్వంతఖర్చుమీద ఏర్పాటు చేసి, కలకటేర్లలాంటి అసలైన జనాన్ని ఆహ్వానించారట. అట్లా పిలవబడ్డ అష్టాదశవర్ణాలజనమూ—ప్రస్తుత విషయం భోజనం గనక—ఒక లిప్తైనా దాటకుండా వచ్చి కూచుని కవాకవా లాడిపోతారేమో, వారిని తపింప చెయ్యడం భావ్యమా అనిట, ఆయన బెంగ యావత్తూ! అంతేట! అల్లా అయితే ఆ మాట కాస్తా అధ్యక్షులచేత సభవారి చెవిని వేయించినా తీరి పోను! అల్లా చేశారు కారు. సమయానికి సంగతులు పోతాయిగాని తోస్తాయా!

అందుకు ఫలితం లేకపోలేదు. నారచన ప్రమాదకరంగా ఉండే భాష తేమో నని కాలేజీఅధికారులు శంకించుతూండడం, సభలో పఠించడానికి పూర్వం నేను అది తమయెదట దాఖలు చెయ్యవలసి ఉంటుందని నాతో చెప్పడం జరిగింది. అల్లా అడిగినంతకాలం, నేను అక్కడ కనిపించడం మాని, కాలేజీకి నావల్ల వస్తే రాగల అప్రదిష్ట తొలగించేశాను! మరికొంత కాలానికి నారచన మీద అంతు తీసెయ్యడం అయింది! ఇప్పుడేమీ లేదు. ఇదీ కథ.]

నాటకరస (3)—1933
ఆర్ట్సు కాలేజీలో
21—1—1933 తారీఖున
పూర్వ విద్యార్థి సంఘ వార్షికోత్సవ సందర్భములో
డాక్టర్ సర్. యస్.
రాధా కృష్ణన్ గారి
అధ్యక్షత క్రింద జరి
గిన సభలో చదివినది.

## పాలక సంఘాల్లో ఎన్నికల మజా

కొందర్ని మరికొందరు పాలించడం అవసరం ఆదినించీ వస్తూనే వుంది. ఎవరేనా కన్య పూర్వం "యావజ్జీవితం నన్ను పాలించవయ్యా" అని తనకి నచ్చిన నాథుణ్ణి స్వయంగా వరించేది. కొంత కాలంపాటు కన్య తరఫున కన్య తండ్రి బయల్దేరి కన్యకి నాథుణ్ణి వరించి పెట్టాడు. ఇటీవల మళ్ళీ కన్య తన వరుణ్ణి స్వయంగానే ఎన్నుకుంటూంది. అల్లాగే ఆదిని ప్రజలు తమర్ని కాస్త్రంత పాలించిపెట్టడానికి నాథుణ్ణి తమరే ఏరి తీసుకునేవారు. కాలక్రమాన్న, ప్రజల్ని పాలించడానికి మాకుమాత్రమే దేవుడు హక్కిచ్చాడు, ఇంకోడు ఎవడేనా తనకీ అల్లాంటి హక్కుందని చెలరేగితే వాణ్ణిపాతెయ్యగలం అని చెబుతూ కొందరు బలశాలులు బయల్దేరు

తోచ్చారు. ఇటీవల మళ్ళీ ప్రజలే తమ పాలకుల్ని ఎన్నుకోడం ప్రారంభించారు. పూర్వకాలపు వివాహ సంబంధమైన స్వయంవరం పోటీల్లో నెగ్గడానికి ఎవరికేనా ప్రజ్ఞ, బుద్ధి, బలం, ధనం, వగైరాలు అవసరంగా ఉండేవి. ఇప్పటి పరిపాలనతో సంబంధించిన ఎన్నికల పోటీల్లో నెగ్గడానికి ఎవరికేనా, నంగోరుధనం నంగోరు నక్కజిత్తులూ ఉండాలి. లేక ఒకవేళ ధనహీనుడైనా పరిపూర్ణమైన నక్కజిత్తు లుండి, ఇంకోడిచేత ధనం పెట్టుబడి పెట్టించినా చాలు, చక్కటి 'ఛాన్సు' ఉంటుంది. వెనకటి స్వయంవరాల్లో, పేరు పడ్డ వారు, చాలా వేషం వేసుకుని, శృంగార చేష్టలు చేస్తూ, సిగ్గుపడుతూ కూర్చునే వారనన్ని, అప్పుడు "బాలరావే, పోల నీభూ" లాంటి పాటలో కన్యయొక్క చెలికత్తె ఆయా మహానుభావుల గుణగణాదికం వర్ణించేదనన్ని, పూలదండకోసం అంతమంది అట్లులు చాచుకుని ఉన్నా, కన్య తనకి నచ్చిన వాడికే వేసేదనన్ని, తరవాత, అవసరం చొప్పున, వాడు, తక్కినవాళ్ళు తన్నేవాడనన్ని, చదువుతాం. నేటి నవనాగరికతతో నిండిన ఎన్నికల్లో పేరు లేని వారైనా, చాలా వేషం వేసుకుని, భీభత్సపు పనులు చేస్తూ, సిగ్గుపడుతూనేనా కూర్చోక, తమ ఆస్తి తినేసే తమ ఏజంట్లు తమకి అన్యాయం చేస్తారేమో అనే భీతి చొప్పున తమరే ఊరేగుతూ తమ ప్రభావాదికం వీళ్లే కొచ్చిందని చెప్పి వర్ణించుగుంటూ, తమకు నచ్చిన

కూడట తమకి దక్కవలసిన తమరే విజయ పుష్పమాలని అక్రమంగా ఊడలాగి, తెంపేసి తెచ్చుకొని, మెడకి చుట్టుకుని, అది సక్రమంగానే తమకి సంక్రమించినట్లు నటించుతూండడం, చూస్తూన్నాం. మానవసేవ చేసీ, ఆత్మార్పణంచేసి తరించడానికి మాకు ఎక్కడా జాగా కనిపించకపోవడంచేతనే, మేం పాలక సంఘంలోకి జొరబడ్డాం అని చాలామంది పైకి ప్రకటించినా, చేతైతే అధికారం - వీలైతే ధనం - వద్దన్నా నమస్కారాలు వగైరా, అతి స్వల్పకాలంలో సంపాదించ వచ్చుగదా అనే ఉద్దేశం చాలామందికి లోపల ఉండడంవల్లే సంఘసభ్యత్వాలకి అంతంత పోటీ బయల్దేరడం. పల్లెలకి కూడా పాలకసంఘా లున్నాయి. అందుకని కుగ్రామ, గ్రామ, పట్టణ, తాలూకా, జిల్లా, రాష్ట్ర, దేశ - పాలక సంఘాలు ఏర్పడేటందుకుగాను ఎన్నికలు జరుగుతూంటాయి. ఎన్నికలు నాగరికత వెల్లడించే కోడిపందాలు. ఎన్నికల రోజుల్లో విస్తారంగా "కాకు" కూతలు వినిపిస్తూంటాయి. ఎన్నికల్లో ద్రవ్యం అపవిత్రంగా ప్రవహిస్తూండడం వల్ల "ద్రవ్య" పదం ఏకకాలమందే వ్యర్థం సార్థకంకూడా అవుతుంది. ఉపాయాలు నాలుగే అనే మాట కేవలం తప్పు నిన్నీ, శతకోటి దరిద్రాలు లేకుండానే యితర అవసరాల్ని బట్టి అనంతకోటి ఉపాయాలు మానవులకి తట్టుతా యనిన్ని ఎన్నికలలో రుజువు దొరుకుతుంది. ఎన్నిక నిఘంటువులో అసత్యం, అధర్మం, అన్యాయం, ద్రోహం, క్రౌర్యం

దారుణం లాంటి మాటలుండవు. ఒకడు, తాను ఏం చెయ్యడానికి నెరుతున్నాడో తెలియకుండానే పెట్టుబడి పెట్టవలసిన అగత్యం ఉండేది ఒక్క ఎన్నికల వ్యాపారం లోనే. ఒకడు పాడు పన్లు చేస్తూవుంటే, మనంకూడా, నెగ్గాలంటే, అంతకంటె పాడుపన్లు చెయ్యవలసి వచ్చేది ఎన్నికల్లోనే. ఎంత పైపైకి ఎగరాలంటే, అంత లోపల లోపల గోతులు తవ్వవల సొచ్చేది ఎన్నికల్లోనే. ముక్కుకి సూటిగా వెళ్ళకూడనిది ఎన్నికల్లోనే. అర్హత అనేమాటేనా స్మరించవలసిన చిక్కులేకుండా చాలామంది జుట్లు నాచేతు లోకి వస్తాయి గదా అని చివరికి నింపు సున్నారావైనా సరే మురియడానికి వీలుండేది ఎన్నికల్లోనే. ఎన్నికల్లో నెగ్గడ మనేదే పరమావధి. "వాడెల్లా నెగ్గాడ్రా, ఏడెల్లా జయిం చాడ్రా" అని ఆశ్చర్యపడేవాడు పూర్వాకాలపు ఘటం. ఎన్నికల్లో నెగ్గిన వాడి ఊహా, వాడి పరివారం యొక్క ఊహకూడా ఏమిటంటే, "ఇక చాలు. మనం కోటలో పాగా వేశాం అన్నమాటే" అని. నెగ్గేసరికే ఎవరికేనా అన్ని విధాలా అస్తమయం అవుతోంది గనక, ఆ తరువాత చేసేపని కనిపించదు, కనిపించినా కరచరణాలు ఆడడానికి సత్తువ ఉండదు. ఎన్నికల్లో విజయం పొందిన వాళ్ళకి సాధారణంగా స్థితి పాడైపోతుంది, అపజయం పొందిన వాళ్ళకి స్థితితో పాటు మతికూడా పాడైపోతుంది.

ఒకచోట, ఆశ్రయింపులు, బెల్లింపులు, ప్రార్థనలు, తిట్లు

తిప్పలు తిరుగుళ్లు, మారాముళ్లు, దగాలు, బెదిరింపులు, కొట్లు గోడాలు, అరెస్టులు, వారంట్లు చార్జీలు, వగైరాలతో పాలకసంఘసభ్యుల ఎన్నికలు అనే "ఎలెక్షన్" జాతర జరిగింది. పాలకసంఘంలోకి మొత్తం ౧౫ - గురు ఆసాములు గెల్చి వచ్చారు. వీరిలో చాలా రకాల జనం ఉన్నారు. కాని, భీమయ్య నారయ్యలనే ఇద్దరు పెండేసిపప్పులు బయల్దేరి చెరో పార్టీ లేవదీశారు. ఎందుకూ? అధ్యక్షుణ్ణి ఎన్నుకోడానికి. ఇక ఎన్నికదినం మూడురోజు లుండనగా, భీమయ్యపార్టీలో ౧౧ గురు, నారయ్య పార్టీలో ౪-గురు ఉన్నారు. విజయం భీమయ్యకి తప్ప దనుకున్నారు. అప్పుడే మహా, భీమయ్య గర్వించిపోయి, అతి నమ్మకంతో, అధ్యక్షునిపాత్ర ఎట్లా అభినయించాలో "రిహార్సలు" వేసుగుంటూ, బ్యాండువాళ్ళకీ తాషావాళ్లకీ బజానాలు పారేసి టీవగైరా పార్టీలకి ఖర్చాయించాడు. అయితే భీమయ్య పార్టీలో ఒక అతడు చిన్నతనంనించీ తాగుడుతో పక తీసుకుని, బాధపడేవా డున్నాడు. అతని పేరు తుమ్మయ్య. ఆ బాధతో సాయంత్రం వేళప్పుడు అతడు మందు వేసుగోడానికి తాగుడాసుపత్రికి వెడుతూంటే, నారయ్యతాలూకుజనం అతణ్ణి పసిగట్టి, అతడి అవస్థకి జాలిపడి, అతణ్ణి కారుమీద ఎక్కించుగుని లేవదీసుకుపోయారు. ఒకపార్టీ పురుషుణ్ణి రెండోపార్టీవారు లేవదీసుకుపోవడం ఎలెక్షన్ నాటకంలో రాక్షసశృంగారం. లేవదీసుకుపోయి, అతనికున్న నూరురూపాయలబాకీ తీర్చడమే కాకుండా అతణ్ణి సారాభ్యంగనం చేయించి, అతగానికి పీపానివాసం

ఏర్పాటుచేశారు. దాంతో, అతనికి బాహ్యాంతరాల్లో ఆ అమృత స్పర్శ కలిగేసరికి అతను ఆ అపస్మారక స్థితిలోనే నారయ్యమతస్థు డైపోయాడు. ఉపాధ్యక్షుడిస్తాం అని ఆశపెట్టి ఒక సోమయ్యనీ, మరో మరో ఆశపెట్టి ఒకకోసయ్యనీ కూడా నారయ్యపక్షానికి తిప్పేశారు. మనసారా ఏపార్టీకీ చెందక ఊగిసలాడే అనామకులు, తూకానికి పనికొస్తారు గనక, వాళ్ళ రేటు క్షణానికి రూపాయి చొప్పున పెరిగిపోతుంది; ఆ ఊగిసలాడేవారు నామకులైతే అసలుకే ఉద్వాసన చెప్పేవారు కావచ్చు గనక, వాళ్ళు ఉభయభ్రష్టు లవుతారు. అక్కడితో నారయ్యపార్టీ ౧౦ అయింది, భీమయ్యది ౮ అయింది. ఇక ఆమర్నాడు అధ్యక్షుడి ఎన్నిక. నారయ్య తన ౯-గురు జనాన్నీ ఖైదీలను పట్టినట్టు పట్టి ఓమేడలో జేర్చాడు. వాళ్లు అక్కడే పిండివంటల్తో దిట్టంగా భోజనం కానిచ్చారు. రాత్రి ౧౦గంటల వేళప్పుడు ఒకతను—తుమ్మయ్యే గావును—బాహ్యానికి వెడతా నన్నాడు. నారయ్య ముందు తనే దొడ్లోకెళ్ళి, దానికి ఇతరదార్లు ఏవీ లేవని ముందు తణిఖీ చేసి చూసి, గోడమీద ఓణ్ణి కాపలా కూచోబెట్టి, వాడు మళ్ళీ అవతలకిపోతాడేమో అని వాణ్ణి గొలుసుతో తాళం వేసి, అప్పుడు తుమ్మయ్యని పంపి, తను ఇవతల కాపలా ఉండి, అతడు వచ్చింతరవాత, వాళ్ళిద్దర్నీ మళ్లీ మేడెక్కించాడు. అంతా పడుకున్నారుగాని, నారయ్యకి కునుకు లేదు. రాత్రి ౧౨ గంటలకి సోమయ్యకి ఓటెల్లిగ్రాం ఉందంటూ ఒకభంట్రోతు

వచ్చి తలుపు కొట్టాడు. కాని నారయ్య, సంగతి ఊహించుగుని తలుపు తియ్యకుండానే, 'సోమయ్య ఇక్కడలేడు' అని కేకేశాడు. 'పోనీ మీరు పుచ్చుగోండి' అని భంట్రోతు కేకేశాడు. 'నేను నిద్రోతున్నాను ప్రస్తుతం' అని నారయ్యఅనేసి ఊరుకున్నాడు. నారయ్యపార్టీవారంతాకూడా రామాయణాలు నెత్తిమీద పెట్టుకుని, ఒకరికి ఒకరుద్రోహం చెయ్యకూడదనిన్నీ, కలిసి ఉండాలనిన్నీ ప్రమాణాలు చేసుకున్నారు. రామాయణాలు పెట్టుగున్న కారణం ఏమిటంటే, వారు పురాణాలు ఎంత పాటిస్తారో ప్రమాణాలుకూడా అంతే పాటించాలనే ఊహ ఉందని చెప్పడానికి! తెల్లారింది. వారు కాఫ్యాదులు అక్కడే పుచ్చుగుని, భోజనం అక్కడే చేశారు. మధ్యాహ్నం, ౧౨ గంటలకి కచేరీకి వీళ్లు వెళ్లాలి -- ఒక మామూలుదారంట. ౩మైళ్లు వెళ్లాలి. పదకొండుగంటలకే రెండుకార్లు తెచ్చారు-- నాలుగుపక్కలా గాలిచొరకుండా గంతలుకట్టి. కాని ఈలోపల తెలిసిన సంగతిబట్టి బయల్దేరడానికి జంకారు. ఏమిటాసంగతీ? మధ్య దారిలో భీమయ్యపార్టీజనం కాసి, నారయ్యకార్లనీ కార్లల్లో జనాన్ని మెత్తగా గుండకింద కొట్టేస్తారనిన్నీ, అధికారుల్లో బంధువు లుండడంవల్ల వాళ్లు నిర్భయంగాఉన్నారనిన్నీ! చుచ్చుచూద్దాం అని చెప్పి, నారయ్యస్నేహితుడు ఒకాయన బయల్దేరి ముందు కార్లో వెళ్లాడు. వెళ్లేసరికి, భీమయ్యజనం కర్రా కంపా పుచ్చుగుని ఈకారుమీద పడ్డారు-మెంబర్లకారేమో అనుకుని. డ్రైవరు తెలివిగలవాడవడంచేత కాయకించిత్ డామే

జీతో దాటించి. గెన్నరకి ఇంకోస్నేహితుడూ అల్లానే కారు మీద వస్తూంటే అతణ్ణీ బడితెబాజా చేస్తూ, "ఈదాన్ని కారెల్లావెళుతుందో చూస్తాంగా!" అన్నారట. అంటే అతడు వెనక్కి మళ్ళిపోయి, ఒక గట్టి ఉద్యోగస్తుణ్ణి ఒక కారులో కూచో పెట్టి ఆదాన్ని పంపించాడు. భీమయ్యజనం ఆ కార్ని ఉరిగారు. అతను కారు దిగి, ఉద్యోగపుకత్రలూ పనిముట్లూ తిప్పే వరకే, భీమయ్యజనం చెల్లాచెదరై పోయారు. అప్పుడు ఆ ఉద్యోగి వెనక్కి వెళ్ళి, దగ్గిరుండి, నారయ్య మెంబర్ల కార్లు బయలుదేరదీయించాడు. పాపం, మెంబర్లంతా అందులో కూచున్నారు, ఘోషాస్త్రీలలాగ, చిన్న చిన్న సందులు చేసుకుని ప్రపంచంలో జనాన్ని చూస్తూనూ! మైలుకి ముందే కార్లు కచేరిలో ఆగాయి—జంతువులుండే సర్కస్ బళ్లు మైదానంమీద ఆగేటట్టుగా! నారయ్య తన జనాన్ని దిక్కులు చూడనియ్యకుండా (చూడనిస్తే, ఏకొంపరేనా అవతలపార్టీని ఎక్కడమోహించి ఏక్షణంలో లేచిపోతాడో అని) లోపలికి నడిపించుకువెళ్ళి, కూచోమని, వోట్లు వెయిపించాడు. సోమయ్యమాత్రం నారయ్య నెగ్గడం సంగతి రూఢికదా అనేసంతోషం పట్టజాలక, "నావోటు నారయ్యదే!" అని పేరుచెప్పి కేకేశాడు. దాంతోటి అక్షరాస్యుడవడంవల్ల అతని ఓటు కందిపప్పు కాటోయి నట్టయి మూలబడిపోయింది. అయినా నర్సే ఒక్క ఓటు

ఎక్కువతో, నారయ్య ఆధ్యక్షపదవి లాగేశాడు. భీమయ్య ఆత్మహత్య చేసుకుందాం అని సంకల్పించుకోకపూర్వమే అతని జాతకం బాగుండచ్చునని ఎవరో జ్యోతిషం చెప్పగా ఆగిపోయాడు.

సోమయ్య ఓటు నవుంసకం కావడంచేత, అతను నారయ్యకి చేసిన సాయం లేకపోవడంచేత అతనికి ఉపాధ్యక్షపదవి దొరకలేదు. అతనికి మొహం జేవురించింది. బుట్టలో పడిపోయాడు గాని నారయ్యపార్టీ అంటే అతనికి ఇష్టం లేదు, అసలు వైరం కుడాను. ఇంతలో మరోటి జరిగింది ఈ సంఘంతరపున ఉన్న ఒకబళ్ళో ఒక మేస్టరీ ఖాళీ వచ్చింది. ధాన్యం చవకైం తర్వాత మేస్టరీ ప్రియమైంది. సోమయ్య మేనమామ కొడుకొకడు పరీక్షలై, ట్రైనింగై, కడంవి అన్నీ కుడా అయి, మేస్టరీపోస్టు నిరీక్షిస్తున్నాడు—లకుముకి పిట్ట చేపకోసంలాగ! అతగానికి ఆ కాస్త పోస్టూ పారెయ్యవలిసిందని సోమయ్య నారయ్యని లోపాయి కారీగా కోరాడు. శాస్త్రం చెప్పినట్టయింది. నారయ్యకీ మేనమామలున్నారు. వాళ్ళకి అమాంబాపతూ ఆరుగురు కొడుకు లున్నారు, మేస్టరీ చెయ్యడానికి తలపాగా చుట్టుగుని సిద్ధంగా కూచున్నవాళ్లు! వాళ్ళలో ఎవరికి, ఆపోస్టు ఇస్తే, కడంవాళ్ళకి ఏం కోపాలొస్తాయో అని ఎటూ పాలు పోకుండా ఇదవుతున్నానని నారయ్య సోమయ్యతో చెప్తూగున్నాడు. సోమయ్య, "సరేలే, కానీ" అని నార

య్యాలో అని, అతణ్ణి విసర్జించి, ఆఒట్టల్లోనే వెళ్లి భీమయ్య పార్టీలో జేరి, అతని కార్లో షికారు వెళ్ళాడు. నిప్పులు గక్కుతూన్న భీమయ్యకళ్ళకి కాస్త చల్లగాలి సోకింది. ఇక వ్యవహారం తిరగదోడడానికి అతను ఎత్తులు పన్నాడు. ఆ సాయంత్రమే నారయ్యపక్షంలో మరొకడైన తుమ్మయ్య పనుండి కల్లుదుకాణానికి వెడుతున్నాడు. ఈసంగతి భీమయ్యకి తెలిసి అతడు తన జట్టుతో వెళ్ళి, కాపు ఆవకుండానే అతణ్ణి కారులోకి ఈడ్చుగుని, చక్కాపోయాడు. అప్పట్లో ఆతని ఆనందం, తీవు, ఆపేక్షామాత్రం పోల్చాలంటే, సాక్షాత్తూ ఆ రుక్మిణీదేవిని రథంమీద వస్తూనే తీసుగెళ్ళిన శ్రీకృష్ణుడు జ్ఞాపకంవస్తాడు. ఆఫలంగా తుమ్మయ్యకి పెద్ద బోయిలరులాంటి పీపాకొనడం అయింది. దుకాణం దగ్గిర్నించి తనయింటికి ఒకపైపు పెట్టించవలిసిందని అతడు వరం కోరుకున్నాడు. సరేనని అతణ్ణి గ్రామాంతరం లాక్కుపోయి భీమయ్య బంధువులింట, ఆతణ్ణి అజ్ఞాతవాసంలో ఉంచేశారు. ఇక్కడికి నారయ్యపక్షంలోంచి ఇద్దరు పరపక్షం అయిపోయారు. నారయ్య పార్టీలోనే మరోసభ్యుడికి ఋణాలవల్ల దివాలా స్థితిలాంటిది వచ్చి పుతి పోయేటంతపని జరిగింది. దివాలా తీసినా పిచ్చెత్తినా సభ్యత్వం పోతుంది. సభ్యుడు కావడానికి ఎవరేనా బళికగలిగి మతిగలిగి ఉండద్దూ మరి! ఆసమయంలో, భీమయ్య వెళ్ళి, ఆ మెంబరుయొక్క ఋణదాతలచేత

ఆ మెంబరికి ఉత్తరాలు రాయించాడు—ఏమనీ? "దక్షిణా దక్కు! లేదా, భీమయ్యపక్షమైనా చేరు" అని. దాంతోటి ఆ మెంబరు భీమయ్యలో కలిశాడు. మరొక మెంబరుకి "నువ్వు భీమయ్య పార్టీలో చేరకపోతే నీకూతుర్ని వాపిలిపెడుతున్నా" నని ఆతని అల్లుడు చేత ఉత్తరం పెట్టించారు. ఆ మెంబరు "విడాకులచట్టం వచ్చి పడుతోంద్కి ఇక అల్లుడంటే నాకు భయమేమిటి!" అనుకున్నాడు గావును, ఆ బెదిరింపులికి జడవలేదు. తరవాత అతణ్ణి తన్నుతాం అని అతనికి శుభలేఖ రాశారు. అతగాడు కొయ్యాయి, ఎందునా బొంగక తటస్థుడై పోయాడు. అక్కడితోటి భీమయ్య బలం ౧౧, నారయ్యది ౮ అయింది.

వెంటనే, భీమయ్య కత్తులూ కటార్లూ నూరి, అధ్యక్షుడైన నారయ్యమీద విశ్వాసరాహిత్య తీర్మానం పెట్టించి నెగ్గడానికి మీటింగు పెట్టించమని నారయ్యని కోరాడు. నారయ్య, మరో ఆకు ఎక్కువ చదివి ఉన్నవాడవడంచేత అందుకు ఒప్పుకుని ఆ పదోనాడు సంఘసమావేశం అన్నాడు. అధ్యక్షపదవిలో ఉండే నిరంకుశత్వం చెలాయించకుండా చెయ్యడానికి, విశ్వాసరాహిత్య తీర్మానం పుట్టింది. అక్కణ్ణించి, ఎవరు అధ్యక్షుడైనా, తక్కిన వాళ్ళకి అతనిమీద విశ్వాసం లేకపోవడం మామూలైంది. పరవిశ్వాసం మాటలా? ఆత్మవిశ్వాసం మాత్రం ఎంత కష్టం! ముందు ఆత్మ ఉండాలి, తరవాత విశ్వాసం ఉండాలి. ఆ మీటింగులోకి

భీమయ్య సపరివారసమేతంగా వెళ్ళి కూచున్నాడు. విశ్వాస రాహిత్య తీర్మానానికి అనుకూలంగా ౧౧ గురు, ప్రతికూలంగా ౬ గురు అయారు. నారయ్యకి అధ్యక్షపదవి ఊడిపోడానికి ఆ తేడా చాలదుగాని తాత్కాలికంగా అతనికే అపజయం. ఆ సంగతి సమావేశ చర్యాసంగ్రహ పుస్తకంలో రాయవలసిందని నారయ్యగార్ని కోరారు. అతడు 'అనుకూలురు ౧౧-గురు ప్రతికూలురు ౬-గురు, సంగతి పై వారికి తెలుపబడును' అనే రాశాడుగాని, 'సదరు తీర్మానం నెగ్గింది' అని మాత్రం అందులో రాయలేదు. భీమయ్యగారి పార్టీవారు, ఆ రాసింది పైకిచదివి వినిపించమన్నారు. నారయ్య అట్లాంటిది అవసరం లేదని చెబుతూ, నవ్వుతూ, చల్లగా, ఆ పుస్తకం దాచేసి, మెల్లిగా బైటికి దారితీశాడు. అతడు వెళ్ళి సోమయ్యని కలుసుకుని, "రామాయణం నెత్తిమీద పెట్టుకుని ప్రమాణంచేసి, తిరిగిపోవచ్చా!" అని అడిగించాడు. అందుకు సోమయ్య, "మీరంతా నా చేతిలోది రామాయణం అనుకున్నారు గావును, పాపం! అది అంతేసైజులో కుట్టించిన తెల్లకాగితాల బైండు బుక్కు! ఎక్కడో, తెలియకుండా మాట్లాడుతారేం!" అన్నాడు. నారయ్య తనపార్టీసంఖ్య గురించి మరి నాడక మరోవుంత తొక్కాడు. భీమయ్య అపుంతా కాశాడు. పదవి లాక్కోవాలని ఒకరూ, ఉంచుకోవాలని ఒకరూ రాక్షస చాణక్యుల్లాగ ఎత్తుపై ఎత్తులు వేస్తూనే ఉంటారు. పాలకసంఘం పాలించవలసిన మేరలో ఉన్న జనంసంగతి ఎవరికీ అక్కర్లేదు.

జనం పంపినమీాదట పాలకసంఘంలోకి వెళ్ళి, వెంటనే ఆ జనాన్ని మరిచిపోడమే ఎన్నికల్లో మజా; ఒకవేళ జ్ఞాపకం ఉంచుకున్నా, ఆ జనుల్లో మొదటి జనుకు తనేగదా అను కోడం మరీమజా!!

## సంగతులు

(1) ఒక కుర్రాడు నకలగడ్డీకరించి బస్తీలో బంధువులింటో ఉండి ఇంగ్లీషులు చెప్పుకున్నాడు. పనిపుట్టక పబ్లికు సర్వీసు పరీక్షకి వెళ్ళాడు. ఆ పరీక్షలో ప్రశ్నలు బి. యే., యం. యే., ఐడ్. యే., వాళ్ళుకుడా పట్టికొట్టేటట్టున్నా, ఎవరేనానరే ప్యాసయ్యేటట్టున్నా, కావలసిన వాళ్ళని పైకిలాగడానికి వీలుగానున్నా ఉంటాయి. ఆకుర్రాడు అందులో తేలాడు కాని పనిదొరకలేదు. అయినా ఆ బంధువులింటోనే ఉంటూ ఊళ్ళో కచ్చేరీలలోకివెళ్ళి "వాలంట్రీ" చేసి వస్తూండేవాడు. ఎక్కడపడితే అక్కడ ఆ అబ్బాయి తనసంగతి చెప్పుకోడంలో —ఆ బంధువులు చాలా మంచివారనీ, డబ్బున్నవారనీ, తనకి భోజనం మస్తుగా పెడతారనిన్నీ అని వాళ్ళని మెచ్చుకుం టూండేవాడు. ఒకనాడు ఇంకంటాక్సు కచేరీలోకివెళ్ళి ఇల్లా చెప్పాడు. తత్క్షణం ఆ బంధువుకి 150 రూపాయలు ఇంకం టాక్సు అంటుగుంది. మండేసుగొచ్చి ఆయన ఆ కుర్రాణ్ణి ఇంటోంచి గెంటేశాడు.

(2) అచ్చువెయ్యడానికి వీలుగా ఉండే తెల్లకాగితం పరాయి దేశాల్నించి వస్తుంది. ఆ కాగితంమీద పన్ను హెచ్చింది. ఇటువంటప్పుడు స్వదేశీ పేపరు మిల్లులు ఆడితే నయమే. మన పేపరు మిల్లుకి ఇంకా ఆటాలేదు పాటాలేదు పాపం! కాని, మొన్న పుష్కర ప్రదర్శనాల్లో కించిత్తు డబ్బు ఆర్జించింది. ఆ డబ్బు పేపరువల్లనే చేసిందంటే జనం ఇంకా సంతోషించి ఉంటారు.

(3) భూములమీద పన్నులు పైకిపోయి, ధాన్యపుధర్లు కిందకి పోవడం గురించి మాట్లాడుతూ ఒక తెలుగు లెక్కల మేష్టరు, "దీన్నే, విలోమ నిష్పత్తి అంటారు" అన్నాడు. వారి స్నేహితుడు ఒకాయన, "ధాన్యప్రసంగంలో పత్తి లేక పోవడమున్నా, పైగా లోమంకూడా ఏమిటయ్యా!" అని శోషించాడు. అప్పుడాయన, "అనగా ఇన్‌వర్స్ రేషియో అండీ" అని విడమరిచి స్నేహితుడితో చెప్పాడు. అప్పుడు ఆ స్నేహితుడు, "అదా! అట్లాయితే, పాఠాలన్నీకూడా తెలిసే టట్టు ఇంగ్లీషులోనే చెబితే నయం" అన్నాడు.

(4) ప్రపంచంఅంతా చదువుకోని వాళ్ళనిరుద్యోగసమస్యతో తంటాలుపడుతూంటే, మనదేశం ఇంగ్లీషు చదివినవాళ్ల నిరుద్యోగంతో మూలుగుతోంది. చీనాలో కాలేజీలు వగైరాలు ముప్పైఏళ్ళదాకా మూసేశారట. మనదేశంలో ఎందుకు మూసెయ్యారో ఇంకా! మేష్టరు పండితుల్ని ఏంచెయ్యాలో తెలియక గావును! ఇంగ్లీషు చదివిన నిరుద్యోగుల్ని పల్లెటూళ్లమీద వద

మని అంతానలపోయిన్నూంటే ఆత్మగౌరవం పోతుందని చాలా మంది ఆ పని చెయ్యలేకుండా ఉన్నారు. ఈ మధ్య అలాంటివారు ఓ పదిమందికలిసి ఓ సంఘం ఏర్పరిచారు. వాళ్లు సంచారం బయల్దేరి కొందరు కొందర్ని చూడ్డం పెట్టుకున్నారు. ఎవర్ని అంటే, ఎలక్షన్ పోటీల్లో వోడిపోయినవాళ్ళనీ, తప్పుమీంచి దిగిపోయిన అధ్యక్షుల్నీ, వగైరాలనీ. ఎంచేతంటే వాళ్ళని ప్రస్తుతస్థితిలో చూసేవాళ్ళూ ఆశ్రయించేవాళ్ళూ ఎవళ్ళూ ఉండకపోడంవల్ల, గుడ్డిలేకుండా చూస్తారనిన్నీ చెముడులేకుండా వింటారనిన్నీ, సావకాశంగా మాట్లాడతారనిన్నీ. ఈ రీతిగా ఆ పదిమంది నిరుద్యోగులకి అన్నం వెళ్ళిపోతోందని సనికిడి —వెళ్ళిపోడం అంటే పొట్టగడిచిపోడం అన్నమాట. మరేం కాదు.

(5) యల్. టి. అనే మేష్టరీ పరీక్ష పేరుపోయి, బి. యి.డి. అని రావడానికి కారణం! బి. యి. డి. అనగా ఇంగ్లీషులో, పడుకునే పక్క, గదా, బియిడీలు ఉద్యోగాలులేక మంచం పట్టాలనే ముందుచూపుతో పై వారు పాతపేరు మార్చి ఈ నామకరణం చేశారా అని ఒక అక్షరజ్ఞాని వాదిస్తున్నాడు.

(6) ఎవరిమనస్సునుబట్టి వారు ప్రపంచానికి అర్థం చెబుతారు. కొందరు పాలక సంఘాధ్యక్షులకి మేష్టర్లని బదలాయించడం తప్ప మరొక సంగతి ఎంతమాత్రం తెలియదని ఒక మేష్టరు వాదించాడు. అది కేవలం పొరపాటనిన్నీ, కొందరు అధ్యక్షులకి మరొక సంగతికూడా తెలుసుననిన్నీ, అదేమిటంటే,

ఆడమేష్టర్లు స్వయంగా బయల్దేరి వెళ్ళి తమదర్శనం చెయ్యనందుకు వారిమీద ఆగ్రహం దాల్చడం అనిన్నీ, ఒక ఆడ మేష్టరు వాదించింది.

(7) వసుదేవుడు కృష్ణుడిమీది ప్రేమకొద్దీ, ఒక శిల్పిని రప్పించి, కృష్ణవిగ్రహం చేయించి పూజచేస్తూ ఉండేవాడుట. ద్వాపరయుగాంతంలో ఆ విగ్రహాన్ని జాగ్రత్తగా భూమిమీదికి దింపి బృహస్పతిగారూ వాయువుగారూ ఇండియాలో ప్రతిష్ఠించారట. బృహస్పతిని గురుడు అని అంటారు గనక ఆ ఊరు గురువాయూరు అయిందిట. ఇదిగాక, మరికొందు మోస్తర్లుగా గురువాయూరు అర్థం ఉందిట. గురు—అనగా బృహస్పతులంత పండితులకిన్నీ, వాయు—అనగా గాలికబుర్లు చెప్పేవాళ్ళకిన్నీ వాదన్లు జరుగుతాయి అనిట! మరొక అర్థం ఏమిటంటే; గురు గొప్పదైనటువంటి, వాయు-కీళ్ళవాయువు—నిప్పింకో, ఇక్కడే ఉంటాం మందుకినడవలేం—అని బాధపడుతూ కొందరు వాదిస్తారనిట. నాగ్వాదనలో అంతా దైవ లే, క్రియాసాధన మాత్రం వేరు.

(8) అభినవ హరిశ్చంద్రుడు సత్యవ్రతం దాల్చడం అవసరం అని గ్రహించి కొంత లోకజ్ఞానం సంపాదిస్తున్నాడు. అయినా, అతడు వనంలో ఉండడంవల్ల చెట్టుక్రింద ప్లీడర్లని ఋణసమస్య గురించి సలహా అడుగుతున్నాడు. అభినవ విశ్వామిత్రుడికి రాయవలసిందని వాళ్ళు చెప్పారు. ఇతడు సుమారుగా రిఫ్రెష్మెంటు రూములో దొరికాడు. అతడు హరిశ్చంద్రుణ్ణి తిట్టినా

అన్టిల్ ఫర్దర్ నోటీసు హరిశ్చంద్రుడికి మారటోరియం ఇచ్చే శాను. అభినవ చంద్రమతితో పడలేక హరిశ్చంద్రుడు సత్య వ్రతాన్ని ఉపసంహారం చేసుగుని, తాను మనిషైనట్టు ప్రపంచానికి దాఖలాయిస్తాడని అనుకుంటున్నారు.

(9) భక్తి, మనస్సుదైనా, కొందరు తమభక్తి సంగతి దేవుడికి తెలిసినా మానినా, తోటిమానవులకి తెలియదేమో అనే భయం చొప్పున, వాక్కాయకర్మలచేత మాత్రం ప్రకటిస్తారు. కొందరు ఉపకారరూపేణా మాత్రం ప్రకటిస్తారు. బాహ్యప్రకటన చేసే ఒకాయన కొయ్యబారి పోవడం, చుట్టు పక్క జనానికందరికీ ఎందుకో తెలియకుండా ఆనంద బాష్పాలు రావడం, అప్పుడు ఇంత హారతికర్పూరం వెలిగించిం తరవాత ఆయనకి స్మారకం రావడం జరుగుతోచ్చింది. ఒక దాసు నేను మట్టుకు ఈ మాత్రం కొయ్యవలేనా అనుకుని, మర్నాడు, జనంతో మాట్లాడుతూ మాట్లాడుతూ 11 గంటలవేళ విరుచుగుని పడిపోవడానికి నన్నాహంచేశాడు. కొందరు "అరెరే! దాసుగారు పడిపోతున్నారు, హారతికర్పూరం తెండి, తెండి!" అని కేకేశారు. అక్కడున్న ఒక గుమాస్తా, "ఇప్పుడు దుకాణాలుండవ్!" అన్నాడు. అది ఎక్కడ వినపడిందో దాసుగారికి వినపడి, ఆయన ఆ రాత్రికి కొయ్యవడం మానుకున్నాడు.

(10) ఒకచోట గారడీ జరిగింది. రెండువందల జనం పోగయ్యారు. గారడీవాడు చేస్తానన్న పన్లలో ఒక తమాషా ఏమింటంటే మనిషిని మాయంచెయ్యడం. సభవారు తమ ఇష్టం

వచ్చిన మనిషిని చూపిస్తే ఆ మనిషిని మాయంచేస్తానని గారడీవాడు చెప్పుగున్నాడు. అప్పుడు ఒక బల్లమీద టెక్కుగా కూచున్న ఒక ఆసామీని వెళ్ళి బుట్టలో ప్రవేశించండని సభవారు పట్టుపట్టారు. అతడు ఒక్కక్షణం నసిగి మెట్టుకి ఒప్పుగుని బుట్టలో దూరాడు. గారడీవాడు అతణ్ణి మాయంచేసి ఒక అరగంటకి మళ్ళీ తెప్పించాడు. సభవారు గారడీవాణ్ణి మెచ్చుకుని బహూకరించారు. కాని, మాయమైన మనిషికి చిక్కొచ్చింది. అతడు బేడ్రెస్సులో ఉండే పోలీసుట! అతడు మాయమైఉన్న టైములో మరొక అధికారి అక్కడికివచ్చి సభ గమనించి అతడు డ్యూటీలో లేడని రాసుగుపోయాడు. తరవాత, సభవార్ని గారడీవాణ్ణీ సాక్ష్యం వేసుగుని తనక్కడ ఉన్నట్టు మాయమైన మనిషి రుజువు చేసుగున్నా అతడు సభయొక్క కార్యక్రమంలో పాల్గొన్నాడని పై అధికారి మళ్ళీ రాసుగుని పోయాడు. అతణ్ణి ఆ పన్లోంచి తగ్గించి మరో భారీపని యిచ్చారు.

## భూకంపం

మొన్నటి భూకంపంయొక్క ఫలితాలు అందరూ వినిఉంటారు. ఔదార్యందాల్చి బిహారులో కష్టపడుతూన్న వారికి సహాయంచేసి ఉంటారు.

పరదేశ జ్యోతిష్కులు ఎవళ్ళూ దీన్ని గురించి ముందు చెప్పకపోయినా ఒక హిందూ జ్యోతిష్కుడు మాత్రం చెప్పాడు. ఉత్తర హిందూస్థానానికి నాశకరం అయి, దక్షిణహిందూస్థానానికి కొంచెం పైత్యకరంగా మాత్రం పరిణమించింది. ఇక్కడ ఎవరిముట్టుకువారు నూనె పిండిపంటల అమితస్వీకరణంవల్ల హెచ్చైన పైత్యం మూలాన్ని కలిగిన శరీరకంపం అనుకుని కొన్నిచోట్ల దగా చేసిన తిలఘాతుకుల్ని దండించడానికి వెళ్లారట. ఒకచోట క్షౌరశాలలో ఒకాయన క్రాపుచేయించుకునే వేళ చెవి కత్తిరించుకుపోయి, ముక్క ఊడి అవతల పడగా తనూ మంగలీ నువ్వుకదిలావంటే నువ్వుకదిలావ్ అని అతనిజుట్టు ఇతనూ ఇతనికి మిగిలినజుట్టు అతనూ పట్టుకుని వీధులోకి రాగా భూకంపం సంగతి వారికి బోధపరిచి, వార్ని విడిపించడంలో, ఒక సనాతనుడు "పొద్దున్నే క్షౌరం చేయించు

గోవాలని ఎందుకన్నారుమరీ!" అన్నాడట ఒకాయన కొంచెం భారీమనిషి, అనగా టన్నులో ఒకదశ ఆయనకు పట్టింది. ఆయన వచ్చి, "నేను కూడా మా అరుగు మీంచి దొర్లానండీ!" అన్నాట్ట అప్పుడు ఆయనకి భూభారం ఆరు మహాక్షితుల టన్నులనీన్నీ (మహాక్షితి—అంటే 1 తరవాత 21 సున్నాలు మాత్రం రాయాలి)—అల్లాంటి భూమింతో చిన్న పోల్చుగోడం ఆశ్లే వీల్లుండదనీన్నీ నచ్చ చెప్పారట. భూకంప కారణాలుగా శాస్త్రజ్ఞులు చెప్పినవి ఉన్నాయిగాని, అవికూడా ఊహాలే, అనుమానాలే. భూ భాగం ఎక్కడేనా అండజారినట్టు జారినా, కొత్తపర్వతాలు చీలి ఏర్పడినా, అగ్నిపర్వతం తయారీలో ఉన్నా, గాలి ఒత్తుడు పడిపోయి శీతకాలం అయినప్పుడు ఇవి వస్తా యన్నారు. ఆ శీతానికి భూమికి కూడా వణుకుపుడుతుందనీ, లోపలఉండే బొగ్గుగనులు అంటుగుంటాయనీ ఒకాయన అన్నాడు. అది బీహారు, అస్సాములోనే రావడం ఏమిా అంటే ఇండియాయొక్క నిర్మాణప్రకారం అస్సామే ఇండియా మొత్తానికి కేంద్రమంటారు, అమెరికాకి చిల్లీ లాగ. ఆ దేశపు ప్రజల సంఘుగ్రహాచారమని పామరులు అనుకుంటారు. 1897 లో దారుణ భూకంపానికి అస్సామే దెబ్బతింటా. ఇతర కారణాలు మాత్రం కొన్ని చెప్పాలి తీరాలి. ఇండియాలో జరిగి ఉన్న పాపాలకని కొంద

రన్నారు. హరిజనోద్ధరణ చెయ్యక పోవడంవల్లనని కొందరు, చెయ్యడానికి యత్నించడంవల్లనేనని కొందరు. పంచములు దేవాలయప్రవేశం చెయ్యడం నించి అక్కడవాళ్లందరికీ—అనగా దేవుళ్లకి, వాళ్ల పెళ్లాలకీ, పరిచారకులకీ వగైరాలకీ భయం వెయ్యడంవల్లనని కొందరు. ఇద్దరు శ్రోత్రియులు ఒకచోట దెబ్బలాడుకోడంలో "శారదా చట్ట మేమిటి, లేకపోతేనూ! భూకంపం రాదూ!" అన్నాడు ఒకడు. రెండో ఆయన, "అది నేను ఒప్పాగో వయ్యా! భూమి ఇప్పుడు ఊగిసలాడుతా ఎందుకంటే, చట్టం అవుదామా వద్దా అని ఊగిసలాడుతూన్న విడాకుల చట్టంమీాద కోపంకొద్దీనయ్యా! మహాప్రభో!" అన్నాడు. ఒక కాలేజీవిద్యార్థి నడిగితే "కాలేజీల్లో ఇంతేసిమంది కుర్రాళ్లని పరీక్షకి పంపకుండా ఆపేసెయ్యడం ఏమిటండీ, లేకపోతేనూ! ఏమిటి దాని అర్థం—వాడ్డజిటీ్మన్? ఇటు వంటప్పుడు "ఎర్తుక్వేక్" అన్నమాటేమిటి, "హెవెన్ క్వేక్" కుడా వస్తే రావచ్చు!" అని కోపపడ్డాడు. ఒక బియ్యే నడిగితే, "డబ్బెట్టి చదివి నిరుద్యోగశాఖలో చేరి ఉన్నవాళ్ల జీవితభారం వహించడానికి భూమి తహ తహ లాడుతోంది." అన్నాడు. తనతోనే లోకం—అధమం భూలోకం!

## పేపరుమిల్లు

ఆంధ్రులయొక్క ధనం, ఆంధ్రులయొక్క కలిసికట్టుతనం. ఆంధ్రులయొక్క కార్యనిర్వాహకత్వం, ఆంధ్రులయొక్క ఓర్పు, ఆంధ్రులయొక్క పరవిశ్వాసం— ఇవీ ఇంకా బోలెడు వీటికి సంబంధించిన లక్షణాలకీ శాశ్వతమైన ఉదాహరణగా పేపర్‌మిల్లు వెలిసింది. దాని సంగతి ఏమైందని చాలామంది అడగనే అడగరు. అదీ ఆంధ్రత్వమే! ఇంగ్లండులో తయారవుతూన్న తెల్లకాగితంకంటె (తెల్ల కాగితానికి ఇంగ్లీషుభాషలో వైట్ పేపరు అంటారు) మిక్కిలి తెల్లగా ఉండే కాగితం తయారు ఎట్లా చెయ్యాలా అని, అది ప్రజ అంగీకరించి స్వీకరించేటట్టు చెయ్యడానికి మార్గాలు ఏవా అని ఆలోచన జరుగుతూండడంవల్ల ప్రస్తుతం ఆగిపోయిందని ఒకరు అన్నారు. కాని, నడపలేకపోయి దాన్ని అట్లానే ఉంచిన వారికిన్నీ నచ్చి నడుపుతాం అని పూనుకుని అభయహస్తం ఇస్తూండేవారికిన్నీ జరిగిన ఒడంబడికలో షరతుకాలం చెల్లలేదనిన్నీ అందులో కొంత గతించి ఇక కొంతే మిగిలి ఉన్నదనిన్నీ, వ్యవహారం గురించిన కాగితాలు కట్టుకట్టగానే ఉన్నాయనిన్నీ, కాగితాల మీదనే దాని వ్యవహారం ఉండగా దాన్ని పేపరుమిల్లు అనడంలో ఏమీ తప్పులేదనిన్నీ. ఒకరు సమర్థించారు.

## విమానం మీద పన్ను

రైలుపడ్డ కొత్తకంలో, పట్టాలు ఏ ఊరిమీదుగా వడ్డాయో, ఆ ఊరివాళ్ళకి కొంచెం గర్వాగా ఉండేది. స్టేషను పడిందనుకోండి మహా, ఓ, మరీ ఇదిగా ఉండేది. ఆ చుట్టుపక్క పల్లెటూళ్ళ వాళ్ళకి కొద్దిగా చిన్నతనంగా ఉండేది. కాని, విమానం ధర్మమా అని దాని పడక్క పట్టాలులేవు. అది పల్లెటూళ్ళమీంచి కూడాపోతూండడం వల్ల, వాళ్ళకి కూడా కాస్త పదవి హెచ్చింది. టపావిమానాలు తరుచైన తరవాత చాలా కుగ్రామాలకి మంచి పేరొచ్చింది. కాని, మునిసిపాలిటీలకి కొంచెం ఆలోచనగా ఉంది. మునిసిపల్ విమానం ఊరుమీంచి వెళ్ళేటప్పుడు, అది మునిసిపల్ హద్దుల్లో వెళ్ళినట్టే అనిన్నీ, అది దారుణమైన నాదం చెయ్యడంవల్ల, బస్తీప్రజ కంపరికి పని చెరుపవనిన్నీ, 'పైన పడితే మిమ్మల్ని ఏంచేశాం!' అని విమాన యజమానులు అనకూడదనిన్నీ, పైకి గాలి యెంతవరకు వ్యాపించి ఉంటుందో అంతమేరలోనూ ఉండే గాలీ — దాని తాలూకు వానవాదిద్రవ్యాలూకుడా కేవలంగా మునిసిపల్ సొత్తే అనిన్నీ, అందుచేత హద్దులలోంచి వెళ్ళే విమానాలమీద, పబురు ఒక్కంటికి ఇంతా అని పన్ను ఉంటుందనిన్నీ, ఒక వేళ గడుసువనంగా ఎవరేనా హద్దులుదాటించి . వెళ్ళే మొదల వాళ్ళకి ధ్వనిగురించిన పన్ను ఉంటుందనిన్నీ, ఒక వేళ ధ్వనిలేని విమానాలు కొద్దిరోజుల్లో వచ్చినా రూపం

కనపడడం చేత పన్ను ఆగిపోయి తీరతాయిగనక యావం గురించిన పన్ను ఉంటుందనిన్నీ, ఒక మునిసిపాలిటీవారు విమానాన యజమాన్లకి రాయవలసిందిగా తీర్మానించుకున్నారు. పైకి చూడడంవల్ల జనానికి పెట్టే మెడనొప్పులకి తాము ఎంతమాత్రం బాధ్యులం కాం అని కూడా వారు ప్రచురించారు. ఒకవేళ విమానంవారు, అందరికంటే పైవారు గనక, ఈ చర్య సక్రమం అని ఒప్పుకోక ఉద్యోగించి పారిపోతే, మరి గత్యంతరం లేదనిన్నీ, అందుకు కిందమీద వాళ్ళే తమ సంజాయిషీ రాతపూర్వకంగా ఇవ్వవలిసి ఉంటుందనిన్నీ, సరదాగా జనంవచ్చి చూస్తారు గనక వారి దగ్గిర ప్రేక్షణసుంకం తప్పకుండా వసూలుచేస్తాం అనిన్నీ, పతనవిషయంలో తగు ఏర్పాట్లుచేసి వసూళ్ళలో అక్రమాలు జరక్కుండా చూడడానికి ప్రేక్షకుడు ఒక్కొంటికి ఇద్దరేసి గుమస్తాల్ని—ఒకర్ని ఒకరుమించేవాళ్ళని— నియమిస్తారనిన్నీ, వచ్చిన గట్టెక్కి దుమ్ము రేగని రోడ్లు వేయిస్తారనిన్నీ తెలుస్తోంది. ఒకవేళ పైన పోయేవారు ఏ ఉడుకుమోత్తనం చేతో ఊరిమీద బాంబులుగాని విషవాయువులు గాని వదిలివెళ్ళిన పక్షంలో బస్తీజనం చూడడానికి రాకూడదనిన్నీ వస్తే నాసికా రక్షలతో రావాలనిన్నీ, తమ ఆజ్ఞకు విరుద్ధంగా ఉత్త ముక్కుల్తో విహరించి విషవాయువుల్ని పీల్చి గతించినవాళ్ళ దగ్గిరనిలబడ్డపాట్న మరణపు పన్ను వసూలు చెయ్యవలసిన అవసరం రావచ్చు ననిన్నీ కూడా వారు చాటించారు.

[మాటకరస (5)—1937
ఆర్ట్సు కాలేజీలో
28 – 2 – 1937 తారీఖున
పూర్వ విద్యార్థి సంఘ వార్షికోత్సవ సందర్భములో
శ్రీ కల్లూరి సూర్యనా
రాయణ రావు గారి
అధ్యక్షత క్రింద జరి
గిన సభలో చదివినది.]

## బస్తీ — దుమ్ము

బస్తీరోడ్డుకేసి చూస్తే జీవితం అంటే పెద్ద పోటీ పందెం అనిపిస్తుంది. ఈ పందెంలో ఎవడి బాధ వాడిది అని తెలుస్తుంది. సకల మానవసమత్వం తెలిసి నమ్మినప్పటికీ, ప్రతివాడూ మరొకణ్ణి దిగదొక్కి ముందుకి తను పెందరాళే వెళ్ళాలని చేసే ప్రయత్నం ప్రత్యక్షం అవుతుంది. పెందరాళే వెళ్ళాలంటే వేగం ఎక్కువ వుండాలి. ధనవ్యయం చేస్తేగాని వేగం సిద్ధించదు. అందుచేత ధనవంతుడు బయుల్దేరి, అనవసరంగా, తాత్కాలికంగా తనంతట తను తనకి ఆరోపించుకున్న అధికారాన్ని ప్రపంచంమీద చలాయిస్తాడు. ఆ చలాయింపుకూడా మనం చూడచ్చు. మనిషిని తప్పుకోమని బళ్ళవాళ్లు. అందులో రెండెడ్ల బండివాణ్ణి ఒంటెద్దు బండివాడు, వీళ్ళిద్దర్నీ జట్కామనిషి, వీళ్ళ,

ఒకవ్యక్తి తాలూకు స్వంతకారు వచ్చేసరికి వీరంతా దారి వదలాలి. డ్రైవరుయొక్క ఔన్నత్యం, చక్రత్వం గమనించడానికి ప్రస్తుతం సావకాశం చాల్దు. "బతకవురా! సావాలనుందా! సూకల్లేవురా! కళ్ళులేవురా! చెవుడ్రా! బుద్ధిలేదురా! యెదవా!" అనే మార్దవంగాఉండే మందలింపల్లోనూ, అవాచ్యాలైన మరి యితర మాటల్లోనూ, ఎంత గొప్పవాడైన పాదచారైనా సరే సాధారణంగా ఉత్తరువుల్నాకి డ్రైవర్లు కొందరు నరదాగా, అలవాటు చొప్పున పొచ్చరిస్తారు. అందుచేత ఎంతవాడావిడి అల్లరీ చేసి, ఎంతదమ్ము రేగకొడ్తే రోడ్డుమీద అంత గొప్ప వాడుకదా అని మనకి తెలుస్తుంది. ఒకస్వంత వ్యక్తిది కాకుండా, ఒక సంఘంతాలూకు కారైతే, ఆ డ్రైవరికి భూమిమీద ఎవ్వరూ అడ్డు ఉండకుండా తప్పుగోవలసిందే. కాని ఈశ్వరవేరు ఉండితీరుతుంది. రావణుడికి మైరావణుడుంటాడు. అల్లానే ఎంతకొమ్ములతిరిగిన కారుడ్రైవరుకీ కూడా అప్పీలుంది. గట్టిపదార్థాలు చెప్పమంటే ఓ కుర్రాడు 'ఇనుము' అని చెప్పాడట. ఇంకా గట్టిది 'ఉక్కు' అని చెప్పాడట. ఇంకా గట్టిపదార్థం ఏది అని అడిగినప్పుడు 'దున్నపోతు' అన్నాట్ట. మేష్టరు, 'అదేమిరా, దున్నపోతా ఉక్కుకంటే గట్టి?' అని కోపపడ్డాట్ట. అప్పుడు కుర్రాడు, 'అవునండి, ఉక్కుతో చేసిన కార్ని దున్నపోతు ఆపేస్తుందండి' అన్నాట్ట. అల్లాగ్గా, దున్నపోతుగారుగాని,

లేక వారి కాల్వాకు పట్టమహిషికాని, ఎంత కాలువారు ఎంత పోరుచేసినా లక్ష్యపెట్టక చెక్కుచెదరకుండా కాళ్ని ఖణాయించి ఆపేది, అవలేలగా పైబ్రిజ వుచ్చుగుంటుంది. ఇక్కణ్ణించి మనం దుమ్ముఘట్టంలో ప్రవేశిస్తాం. అందుచేత, ప్రస్తుతం బస్తీరోడ్లమీద మనకి కనిపించే యితరదృశ్యాల్ని వొదిలేసెయ్యాలి. అవి ఏవి అనగా, సైడుకాలవలు : సైడుకాలవల్లో ఉన్నన్ని వర్ణభేదాలు ఎక్కడా లేవు. అవి ఓ ప్రక్కగా ఏడవండ్రా అంటే అల్లా ఏడవక, స్థితి పాడుచేసుగుని, రోడ్డుకి అడ్డంగా పడుస్తాయి భయభక్తుల్లేకుండా! వాటిలోనీరు : దానికి, రామరామ, బొత్తిగా సిగ్గులేదు. పాకనీరు ఎండమంటే ఎండదు, ఆయిలు ఒలికినా మండమంటే మండదు, పోనీ కంపులేకుండా ఉండమంటే ఉండదు. తననిగురించి అడ్డమైనవాడూ తలోమాటా అని తలోతిట్టూ తిడుతున్నారని అది లోపల్లో తెగి కుళ్లికుళ్లి పోతూంటుంది. 'నిజం దేవుడెరుగును, నీరు పల్లం ఎరుగును' అని శాస్త్రం. మనం నిజాన్ని దేవుణ్ణీ కూడా ఎరగం గనక, నిజం దేవుడెరుగునని నమ్మితే నమ్మొచ్చు. కాని ఈ సైడుకాలవలకేసి చూస్తే 'నీరు పల్లం ఎరుగుండడం' సందేహించవలిసొస్తోంది. వాటిల్లో నీరు 'నీరు' అనే, శబ్దానికికూడా అప్రతిష్ఠ తెస్తోంది, ప్రతిష్ఠతో ఉంటున్నాననుకొని. దానికి పల్లం ఏవేపో తెలియకపోతే చస్తామా మరీ! పొద్దున్న తూర్పుకి వెడుతూం

టుంది. మనం ఏదేనా పని చూసుకుని కాస్సేపట్లో చక్కా వచ్చి మళ్ళీ చూసేసరికి పడమటగా పోవాలని తంటాలు పడుతూంటుంది, దిక్కుమాలి తంటాలుపడడం ఇదీనూ! ఇవిగాక, పైపులు: ఇక్కడ స్నాన, పాన, ప్రక్షాళన, గ్రహణ, క్రీడ వగైరా ఉద్దేశాలతో అనేక జనం పోగవడం! ఒక్కొక్కప్పుడు కుంభమేలా: ఘటవాయిద్యాం: మాతృ భాషలో ఉపన్యాసపు పోటీలు: అక్కడే యుద్ధాలు—శస్త్రాస్త్ర ప్రయోగాలు. ఆ పైపులప్రక్క బహు జంతువులు: అనేకదూరం, శ్రమపడి, తొందరగా తిరిగి రావడంవల్ల అనేకరకాల మాలిన్యం పొట్టనెట్టుకుని స్వగ్రామం వేంచేసిన అంచీబస్సులు. వాటిని పరిశుభ్రంగా పై చెప్పిన మాలిన్యం యావత్తూ అక్కడా అక్కడా పడిపోకుండా, మంచినీళ్ళు తీసుకునే వోటే పరిచి ఉంచితే, యథాశక్తిగా జనం ఆరగిస్తారు, ఎక్కడికక్కడికే ఆ ఊరి అని పైపు పక్కనే, పల్లెటూరిచెర్వో గేదెల్ని కడిగినట్టు, ఈ బస్సుల్ని కడిగడం. ఇంక రకరకాల కంపులూ; వాటికి ఆలవాట్లులూ: వగైరా వగైరా ఉన్నాయి. అవన్నీ వదిలి దుమ్ము గురించి మాత్రం కొంచెం ముక్కుపట్టుకుందాం.

దుమ్ము హైరోడ్డుమీద ఎక్కువ ఎత్తుగా లేస్తుంది. అల్లా పైకి లేచిపోవడంలో దానికి దురుద్దేశం ఎంతమాత్రం లేదు. సరిగదా, దాని గోలంతా ఏమని అంటే, 'హై రోడ్డు' అనేవాట్లో 'హై' అనేది సార్థకం చెయ్యాలనే.

రకం జీవం పీటికికూడా ఉంచితీరాలని ఏ ధురంధరుడో కని పెట్టకపోకాడా, అపూర్వవ్యాసాలు ప్రకటించి పట్టావుచ్చు కోకపోకాడా అని, కొన్ని పరిషత్తుల్లో తన్నిమిత్తం పట్టాలు చేయించి, మెరుగెట్టించి, 'రడి' లో ఉంచారు. 'దుస్థితి' అంటే దుమ్మువల్ల కలిగేస్థితి అనే విగ్రహం చెయ్యించాలని కొందరు అన్నారు. సృష్టి, స్థితి, లయాలు దుమ్ములోనే వని మనికి బస్తీదుమ్మువల్లే తెలిసొస్తుంది. దుమ్ముకేసి చూస్తే, అన్నిందాలా మానవుణ్ణి తను కనిపిస్తూంటే, మానవుడు కనికరంలేకుండా దీనిని ఉపయోగించినందుకు, మరి ఓర్చుకోడం దుర్భరమై భూమి మానవుణ్ణే దుమ్మెత్తి పోస్తోందా అనిపిస్తుంది. ఇప్పటిదాకా కొందరు జనం 'కళ్ల జోణ్ణి' పట్టుగుని 'ముక్కద్దా' లనీ, 'ముక్కుజోడ' నీ కూడా వాడేస్తున్నారు. ఇక అల్లాంటివాళ్ళ ఆటలు సాగవు. బస్తీదుమ్ము ధర్మమా అని ముక్కురంధ్రానికి ప్రత్యేకపు జోడు ఏర్పాటు కావచ్చు. కాళ్ళకి రకరకాల జోళ్లు ఉన్నా యనీ (అంటే బంగారంవీ, వెండివీ, ఇనపవీ, కర్రవీ)— చేతులుకి జోళ్ళున్నాయనీ, కళ్ళకి జోళ్ళు సరే సరి అనీ,— చివరికి కర్మవశ చెవలకి గుడా జోళ్ళుండడం ఏమిటి, మూకు లేకపోవడం ఏమిటి అని ముక్కు రంధ్రాలు చిరకాలం భగవంతుణ్ణిగురించి వాయుభక్షణ మాత్రం చేస్తూ తపస్సు చేశాయి. "క్రమేపీ చుట్టుప్రక్కలవాళ్ళందరికీ రాష్ట్రాలు ఏర్పడనీండి. ఆ పని జరిగిపోయిం తరవాత మిగిలిపోయింది

దానంతట అదే మన స్వంతరాష్ట్రంగా ఏర్పడుతుంది. ఇంకోర్ని అడగా అక్కర్లేదు. వాళ్ళు ఇవ్వా అక్కర్లేదు. మనం దానం పట్టా అక్కర్లేదు" అని ఆంధ్ర జనవేదాంతుల్లాగ ఊరుకోక అని తపస్సుచేసేనరికి, "మీకు జరిగిన అన్యాయం కారుయుగం రానీండి తొలగిస్తాను" అని ఆయన అన్నాట్ట. కారుయుగం అంటే కారేజి. అదే ఇంగ్లీషులో గారేజి అని అంటున్నారు—అరవ సాంప్రదాయంలో 'క' కారాలు 'గ' కారాలుగా మారతాయి గనక. ఎంత గొప్పవాళ్లైయితేం, పట్టపగలు ఆశేషజనానికీ, కళ్లల్లో దుమ్ముచల్లగలవారుంటారుగదా అని రోడ్డు మీదే తెలుస్తుంది. అటువంటప్పుడు, ఇక రాత్రివేళ అడిగారూ కథ ! సాయంత్రం పడ్డతరవాత కార్లు, ఇంటిముహూం పెట్టిన ఎద్దులాగ మరీ జోరుగానడుస్తాయి. ఎందుకంటే, పగలైతే వినపడడం కోసం కుయ్యాలి. రాత్రికనబడితేచాలు. వెలుగు యొక్క వేగం శబ్దం వేగానికి లక్షరెట్లు, మళ్ళా మాట్లాడితే పదిలక్షలరెట్లు. అందుకని రాత్రివేళ కారు చాలా దూరంలో ఉండగానే ఆధూళిమండలంలో కారు దీపోదయం అయి మనకి వచ్చే కారుకీ మధ్యనుండే జన జంతు శకటాదులు అన్నీ ధూళి తెరమీద ఆడుతూన్న నవీనయుగపు తోలు బొమ్మల్లాగ, తెల్లకాగితంమీద సిరాబొమ్మల్లాగ మిక్కిలి శోభగా ఉంటాయి. అందరికీ ఒకే రంగు ప్రసాదించడంవల్ల వర్ణ భేదం నశించ డానికన్నీ, మధ్య భాగాలో ఉండే వీర్ని

వార్నికూడా ఏక కాలమందే అది తాకుతూఉండడంవల్ల అస్పృశ్యతా దోషం తొలగిపోడానికిన్నీ బస్తీదుమ్ము కిందామీదా తెలియకుండా పనిచేస్తోందని చెప్పొచ్చు. బస్తీపెద్దరోడ్డుమీద, రాత్రివేళ, జట్కాలో వెళుతూ, మా స్నేహితుడొకాయన, — అతడు ప్రబంధకవిత్వం తప్ప మెచ్చడు — 'స్మర శిలీముఖ కుసుమ కేసర పరాగధూళి' — అనేది జ్ఞాపకం తెచ్చుకుని, అప్రస్తుతం అని తెలిసినా శ్రీనాథుణ్ణి పొగిడి, కుచ్చి అంతటితో ఆగక, ఆ దుమ్ముమీద కవిత్వం ప్రయత్నించి, బస్తీశృంగార స్తవహార ప్రారంభోత్సవం సూచించడానికి బయల్దేరిన పుష్పతోరణ విలాసఫలితం అన్నాడు. కొన్ని చోట్ల వీధిదీపాలు తామే చీకటికి భయపడి కళ్ళు మూసుకున్నట్టు కనిపిస్తాయి. ఒక్కొక్కప్పుడు మూడు నాలుగు సార్లు ఇటూ అటూ ఒకే క్షణంలోనే వెళ్ళడం గమనిస్తే. వీధిదీపాలు ఎక్కడుంటాయో చెప్పకోడానికి ఇతరదీపాలు కావాలి. ఏమైనా చెప్పడం గగనం. రాత్రిభాగంలో వెలుగు కిరణాలకి దుమ్ము తెచ్చే ఒక వైభవం తేవడంవల్ల, వెలుగులూ అడ్డూ నీడలూ గనుపించి, గ్రహణాల కారణాలూ, రకాలూ, ముందుగా మూసుకుని నేర్చుకోవచ్చునని భూగోళధూళి శాస్త్రప్రియులు చెబుతున్నారు. ధూళిలేని పక్షానికి వర్షాలు నశించుతాయి గనక, ఇది మానవులకి అత్యంతోపయోగం అని కొందరిమతం.

## పదిరూపాయల టిక్కట్టు

పొద్దూ పద్దూ లేకుండా తిరగడాన్ని గురించి చెప్పేటప్పుడు తెలుగువాళ్ళు, కాలుగాలిన పిల్లిలా తిరగడం, మారని డబ్బులా తిరగడం, తడిమన్ను పొడిమన్ను అయేట్టు తిరగడం, ఆసుకండెలా తిరగడం, అరువు సైకిల్ లాగ తిరగడం అని అంటూంటారు. రైలు కంపెనీవారి ధర్మమా అని ఇటీవల 'పదిరూపాయల టిక్కట్టువాడులాగ తిరగడం' అంటున్నారు. తిరగడానికి నిర్ణయించిన కాలం వెనక నెల ఉండేది. ఇటీవల అది చిక్కి సగం అయింది. ఆరోజుల్లో జనం కొత్తవార్ని కలుసుకోగానే, 'ఎప్పుడు రావడం?' అని హెచ్చరించి, 'నేను ఈమధ్య పదిరూపాయలు' అని అవతలవారు అనగానే, ఇంకా ఏం దస్త్రం విప్పుతారో అని, 'అల్లాగా? నాకు పనుంది సెలవు' అని చెప్పేసి బలవంతంపు సెలవు పుచ్చుగుని పోతూండడం జరిగింది. ఈరీతిగా తెలుగు భాషలో చరితార్థులైనవాళ్ళని అందర్నీ అభినందించవలిసిందే. రైలువాళ్లు మంచిపని చేశారని కొందరన్నారు. తెలుగువాళ్ళ ప్రథమావేశం, వేలంవెర్రి, డబ్బుఖర్చు వేదాంతం ఎగసందోసి సొమ్ము చేసుకున్నారని కొందరన్నారు. "ఉన్న పన్లన్నీ దబ్బున చూసుగోవచ్చు, రండయ్యా!" అని రైలువాళ్ళు పిలుస్తూంటే రాం అని పట్టుపట్టడం భావ్యంకాదని, పన్లున్నవాళ్లూ, పన్లు ఉన్నాయి అనుకున్న

వాళ్ళూ పనిలేనివాళ్ళూ, ఏదోపని ఏర్పాటు కాకపోతుందా అనుకున్నవాళ్ళూ, 'ముందు టిక్కట్టు కొనేసి ఓమూలన్నించి వర్కటు ప్రారంభిస్తే ఏ ఊళ్ళోదిగినా అక్కడ ఏ ఎరుగున్నవాడో, వాడులాంటివాడో దొరక్కపోతాడా, ఎక్కడో ఎల్లానో మకాం వెయ్యలేకపోతామా, కానీ! దేవుడున్నాడు!' అనుకున్నవాళ్ళూ, ఇంకా చాలామంది ఇతరులూ కూడా ఆ తరుణం ఉపయోగించుకున్నారు. టిక్కట్టు పదిరూపాయలైనా, వందలకొద్దీ జనం చిన్న - పెద్ద - స్త్రీపన్లకి కూడా ఎగడి, వేలకొలది టిక్కట్లు కొనుక్కోగా, రైలువారికొచ్చిన డబ్బు లక్షలమీదా, బయల్దేరి తిరిగిన జనం సంకల్పించుకున్న పన్లు కోట్లమీదా, ఈ జనమూ వీరియొక్క దర్శన సమావేశ, పరిచయ ఆతిథ్యభాగ్యం పొందగలిగిన ఇతరజనమూ పడిన కష్టాలు శతకోట్లమీదా ఉంటాయని మాస్నేహితుడు ఒకాయన మదింపువేశాడు. వీరిలో చాలామందికి నెరవేరిన పన్లు లెక్కకి అందవు. కొందరికి పన్లు ఒకట్లమీద అయినాయి. కొందరికి ఒకటేపని నెరవేరింది — ఇంటికి చేరుకోడం — చాలామంది పని అయిపోయింది — కాలం అయిపోయి ఇల్లుచేరేసరికి కొందరికి ౧౨ రోజులపాటు నిరుద్యోగసమస్య తెగిపోయింది. అందరికీ నిష్పక్షపాతంగా 'దశ' మారిపోయింది. రైలువారు జనానికి, ఇటువంటివే నూతనదశలు త్వరత్వరగా ఇప్పిస్తారనిన్నీ, పందరూపాయల టిక్కట్టుమీద సంవత్సరమున్నూ, వెయ్యిరూపాయల టిక్కట్టుమీద యావజ్జీవి

తినుమన్నా తిరిగి పనులు చూసుకోవచ్చును అని అంటారనిన్నీ అప్పుడు బ్రతికున్న తెలుగు వాళ్ళంతా కూడా రైళ్ళెక్కి ఇటో అటో ఎటో తమకే తెలియని స్టేషన్కి వెళుతూంటారనిన్నీ అప్పుడు బస్తీల్లోదుమ్ము తగ్గి, కంపుపోయి, జనం ఉండరు గనక ఆరోగ్యం హెచ్చి, ఇళ్లు చౌకై ఇంకా బోలెడు సదుపాయాలు వాటంతట అవే సిద్ధిస్తాయనిన్నీ, ఎల్లానో అల్లా ఆ టైములోనే కొత్త ఎన్నికలు పడేటట్టుచేసి కొన్నిపక్షాలవారు ఒకటి మెజారిటీ తోటైనా నెగ్గాలని చూస్తున్నారనిన్నీ పామరులు అనుకుంటున్నారు. ఈరీతిగానే వెయ్యి రూపాయలకి ఓడమీద భూలోక యాత్రా టిక్కెట్టిస్తున్నా, మరికొంతకాలానికి ఓంట్ల రూపాయలకి విమానంమీద సంపూర్ణగ్రహచారపు టిక్కెట్టిస్తున్నా దొరుకుతాయనిన్నీ, అప్పుడుజీవరాసులు సశరీరంగా ఈరేడులోకాలూ పర్యటనంచెయ్యవచ్చుననిన్నీ శాస్త్రజ్ఞులు నమ్ముతున్నారు.

## కొత్త వోట్లు

'వోటు' అనేది తెలుగులోకి దిగిన ఇంగ్లీషుమాటల్లో ఒకటి. పల్లాటలో ఉన్న 'పటు' అనేది దీనికి కొంత సంబంధం గల తెలుగుమాట. కాని దానికి కేవలతుల్యంకాదు. మొన్నటి ఎన్నికల్లో అక్షరాస్యులు కాని భారతీయులుకూడా చాలా మంది తమవోటుసాధించారు. కంటపడే వస్తువు కాకపోడంనించి 'వోటు' అంటే చాలామందికి తెలియలేదు. క్రమేపీగాని తెలియదు. 'ఈయాల వోట్ల సంబరంట, వోటంటే యేటిబాబూ!'

అని నన్ను ఒక పరిచితుడు అడిగాడు. 'వోటు' అంటే 'ఇష్టం' అని చెప్పాను. 'నా యిష్టమేనా, బాబూ' అన్నాడతడు. 'నీయిష్టమేకాదు, ప్రతివాడి ఇష్టమూ కనుక్కుని, మన్ని పరిపాలించడానికి మంత్రులువగైరాలని తయారుచేస్తారు' అన్నాను. 'మరి, నాయిష్టం అన్నారు కాదు బాబు, మరి!' అని మళ్ళీ అతడడిగాడు. 'అవును. నిన్ను ఎవరి సలహామీద పరిపాలన చెయ్యాలో ఆవ్యక్తిని ఎన్నుకోమన్నారు. అంతేగాని ఆలనా పాలనా లేకుండా నీయిష్టం వచ్చినట్లు ఉండమన్లేదు' అన్నాను. 'బస్. ఇంతేనా బాబు. అయితే నాకు తెల్దు' అనేశాడు. మనిషి లాయన ఇంకా చల్లగా ఉండి దౌర్జన్యరాహిత్యమూ అని ఉరుము తూండడంవల్ల కాకపోతే ఎన్నికలు ఇంత నెమ్మదిగా నడిచి ఉండవ్ అని చాలామంది నమ్మకం. ఈసారి ఎన్నికల్లో ముఖ్యవిశేషాలు రెండు. మొదటిది ఎన్నికలు రంగులసొగసుగా జరిగాయి--వర్ణఆశ్రమధర్మాన్ని అనుసరించి వ్యాపారం జరిగింది. ఈ వర్ణవిశేషాలు మన రాజధానిలో మరికొన్ని చోట్లానూ. ఇతరచోట్ల జంతువిశేషాలు! పోటీగా నిల్చే అభ్యర్థుల్ని పార్టీ వారి రంగులు కోరుకోమన్నారు. ఒకపార్టీ ఎరుపు కోరుకున్నారు. ఎరుపురంగుకి అధిష్ఠానదైవం అంగారకుడు. ఎరుపు రంగు మ్యాపులమీద ఇంగ్లీషువారి రంగు. ఆరంగు లేతది. దంభానికిన్నీ, ముదరది క్రోధానికిన్నీ, శక్తి, బలం, పట్టుదలా వీటికి చిహ్నమని జ్యోతిష్కుల సిద్ధాంతం. అల్లానే పసుపు రంగు. దానికి దైవం బుధుడు. అది జ్ఞానానికి చిహ్నమని.

గ్రంథాలు చెబుతున్నాయి. ఆరీతిగానే ఆకుపచ్చకి, దైవం చంద్రుడననీ, రెండురకాల ఆకుపచ్చ ఉందననీ ఒకటి దగాకినీ, రెండోది కరుణకినీ చిహ్నాలననీ కూడా పుస్తకాలు చెబుతున్నాయి. ఇదిగాక తెలుపు. తెలుపు వర్ణమే కాదనీ, ఒక వేళ వర్ణమనంటే సకలవర్ణ సమావేశమనీ ఉంది. 'రంగులు—వాటితత్వములు' అని ఈ నడుమనే ప్రచురంఅయిన ఒక గ్రంథంలో ఆకుపచ్చ అనే వర్ణం, పసుపుపచ్చలోంచి విడిచిపోయిన వర్ణం అనికూడా ఉన్నది. నేను విలోమజ్యోతిష్కుణ్ణి అవడంచేత సంగతి జరిగిపోయిం తరవాత చెప్పవలిసొచ్చింది.

జీర్ణం కాకపోయినా 'వోటు' అనేమాట తెలుగు వాళ్లు ఎల్లానోమింగి ఇదవుతున్నారుకాని, ఈ తెలుగువాళ్ళప్రాలుద్ధం కొద్దీ మరోమాట బయల్దేరింది. అది చాలా ప్రమాదాలుకూడా తెస్తోంది. ఒక ఇంగ్లీషు చదువుకున్నాయన ఒక రైతుతో 'ఏమయ్యా 'బూతు' కి వెళ్లివచ్చావా?' అని అడిగేసరికి అ రైతు నాలుగువేళ్లూ అంటుకునేటట్టు ఆ పెద్దమనిషిని ఎడం దవడమీద ముద్రకొట్టాడు. 'ఏమిట్రా ఫూల్' అని ఆయన అనేసరికి, రైతు ఆ మనిషి ఇంకోటిచ్చుకుని, 'ఇంగ్లీషు సదివావు! బూతేటయ్యా నీకు!' అన్నాడు. అప్పుడు నలుగురూవొగై, రైతుని ఆపి, ఆయనమాటల్లో వ్యత్యాసం ఏమీలేదని, అది ఎన్నికల బూతనీ, చెప్పి రైతుని ఒప్పించి సాగనంపారు. 'ఈయూల పోలితీర్థంత్రోయ్' అని జనం అనకోడంకూడా విని పించింది. అది 'పోలింగు' కి వచ్చినపాట్లు! ఆ వోట్లువేసే భవనాలకి

ఎదట నీడఎక్కడా లేకపోవడంవల్లా, జరాజరా మనుష్యుల్ని లోపలికి వొదలడానికి స్త్రీలుకూడా ఉండడంనించి పిల్లేశా కొందరు ఎండలో చాలాసేపు ఖరాయించి, లోపలికి, వెళ్ళేసరికి, కళ్ళు పచ్చపడిపోయి, కాగుర్ల మనిషల్లా అయి, అన్ని పెట్టెలూ పచ్చగా కనిపించి అసలు పచ్చ ఏదో కనుక్కోడానికి బాధపడ్డారు! అంధులికి పెట్టెలుండే వరస చెప్పి పంపించారట. భర్తపేరు చెబితేగాని ఒకావిణ్ణే పిల్లే దన్నారట. పక్కవాళ్లు చెప్పినాసరే, ఆవోట్లు ఉవ్యోగి, ఆవిణ్ణే చెప్పనుని పట్టుకట్టారట - తలుపు దగ్గిర అమ్మలక్క లంతా పట్టుపట్టినట్టు! ఆవిడ సిగ్గుచొప్పున చెప్పలేక వోటు పోగొట్టుకుందిట! ఆవిడ చర్యలో పౌరుషప్రకటన ఏంతమాత్రం లేకపోడంవల్ల ఆ వూరి స్త్రీ సమాజం వారు తమ సభలోంచి ఆవిణ్ణి తొలగించినట్టు తెలుస్తుంది. ఈఎన్నికల్లో రెండోవిశేషం జమిలి వోట్లు, ముప్పేటవోట్లు. కలిసి వెళ్ళినప్పుడు ఉమ్మడి ప్రచారాలూ, విడివిడిగావెళ్ళి నప్పుడు జమిలివోటుగాని, ముప్పేటవోటుగాని తనికే ఇమ్మనీ, తక్కిన ఒకదాంగాని, ఇద్దరూగాని సున్నేఅనిన్నీ ప్రచారాలు జరిగినట్టు వదంతులు. సత్యాసత్యాలు తెలిసే వ్యాపారం కాదిది. అసలు వైరిపక్షాల్లో సభ్యులు ఇటువంటి ప్రచారాలు చేశారేమోకూడా తెలియదు. పచ్చరంగూ ఎర్రరంగూఅంటూ వర్ణభేదాలు వచ్చింతరవాతా నున్నా, జమిలివోట్లు వచ్చింతరవాతానున్నా బయల్దేరిన ప్రమాదం ఇదే. కొన్ని పెట్టెల్లో ఓటుచీట్లకాక కర్రెన్సీ నోట్లు కూడా దొరికాయని జనం అనుకున్నారు. మన్యంవేపునించి

వచ్చిన ఓ పెట్టెలో తేలుపిల్లలు కనిపించాయిట, వోట్లుమాత్రం లేవట! పరీక్షలు జరిగిన కొన్నాళ్ళకిగాని ఫలితాలు తేల్చడం కష్టం. పరీక్షలు తీసేస్తే బాగా చదువు సాగుతుందని చాలా మంది ఉద్దేశం. ఒకవేళ అవి తీసేసినా జీవితపరీక్ష తప్పదు. ఫలితాలు రాకపూర్వం అభ్యర్థులు మార్కులు మదింపులు వేస్తూంటారు. ఇప్పుడంటే మార్కులు కూడా ప్రశ్నలచివర అచ్చుకొట్టి చెప్పేస్తున్నారుగాని కొందరు కాలంక్రిందట మార్కులనేవి తెలుసుకొన్నాళ్లాగ పరీక్షాధికారుల దయాగ్నికే వుంచుకొనేవారు. ఆ మదింపులు చాలా చిత్రంగా ఉంటాయి. ప్రతివాడూ, ఎంత అధముడైనా సరే, ఆ మదింపులలో నూటికి 35 వచ్చేటట్టు వెయ్యగలడు. "నస్తూరికి 10 తీసేస్తా దయతో, ఫలానాప్రశ్నకి సగం పోతుందనుకో, ఓటడిగితే మరోటి రాశాను గనక ఫలానాప్రశ్నకి 15 పోతాయనుకో, పేజీ తిర గేస్తే మరి రెండు పశ్నలున్నాయి నేనవి అక్కడ చూడలేదు కనక వాటికి 20 పోతా యనుకో, అయినాసరే నాకు ప్రతిసబ్జెక్టు లోనూ హీనపక్షం 35 రావాలి. ఫలితాలు తెలిశాం తర వాత ఆ విద్యార్థి కనిపించడు. ఎందుకంటే వాడికి మార్కులన్ని సబ్జెక్టూ కలిపి 35 వచ్చిఉండవ్. అల్లాగే, ఎన్నికల అభ్యర్థులు కూడా వోట్లు లెక్క వేసుగుని విజయం మదింపు వేసుగుని ఉంటారు. కాని ఓడటంలేని విజయం ఉండదు. తిట్లు, ధనం, శ్రమ, ఎత్తులు జిత్తులు, ప్రతివ్యూహాలూ, నిజాన్నిదిమించే అబద్ధాలూ వగైరా ఉంటేనేగాని నెగ్గడం ఉండదు; ఓడటం ఉండదు!

## కోతులు

ఎల్లాగైతేం, చివరకి, రాజమండ్రీకి కొన్ని కోతులు దిగాయి. ఇవి మన్యపునరుకా, అద్దరివా, ఇద్దరివా అనే మీమాంస తేలలేదు. పెంకాములు కొత్తగా కాల్పించిన వారు కుమ్మర్లతో కుట్రచేసి, పురపాలక సంఘానికి అర్జీపెట్టుగుని, వార్ని విశ్వాస రాహిత్య తీర్మానంతో బెదిరించి, వారిచేత మరొక జిల్లావార్ని ఒత్తుడుచేయించి వీటిని తెప్పించారని కింవదంతి. యథార్థం నరుల్లో తేలనప్పుడు వానరుల్లో అసలు కష్టం. అయినా మా స్వకీయవిలేఖరి కొంతకాలంనించి వాటితో పరిచయం ఉన్నవా డవడంవల్ల ఇట్లా రాస్తూన్నాడు.

ఇవి కోతులు. అనగా పండుకోతులు. కొంతకాలం కిందట కొన్ని కొండముచ్చులు కూడా రాజమండ్రీ వచ్చాయి. అవి నల్లకోతులు. ముప్ఫై నల్లవాటికీ ఒక ఎర్ర కోతి సమాధానం చెబుతుంది. ఇవీ అవీ కూడా వెనక అద్దరిని ఒకతోటలో ఉండేవి. చుట్టుపక్కల్నించి రోజూ సాయంత్రపువేళా, సెలవు రోజుల్లో పగలంతానూ, వాళ్ళ సన్నిహితజ్ఞాతులైన పిల్లలు కొందరు కుక్కలతో కూడా వచ్చి వాటిని పరామర్శించి పోతూండేవారు. మనిషికీ కోతికీ సంబంధం ఏమంటే జంతుజాలంయొక్క ప్రెసిడెంట్, వైస్‌ప్రెసిడెంట్ సంబంధం. వెళ్ళే పిల్లల్లో కొందరు కొండముచ్చులికి రొట్టెముక్కలు వగైరా గిరవాటేస్తూండేవారు. వాటితో యుద్ధంచేసి ఆ ముక్కలు ఎవరికీ

అందకుండా చేస్తూండేవి కోతులు. కొండముచ్చులు జీవించడం దుర్భరం అయింది. ఒకనాడు అవన్నీ అక్కణ్ణించి పోవాలనుకుని ఒకపడవ ఎక్కాయి. పడవవాళ్ళు బేజారెత్తి దిగిపోయారు. అప్పుడు ఆ యిద్దరు పల్లెవాళ్ళని ఓపాతిక కోతులు చుట్టేసి పడవ ఎక్కించి, వాళ్లు దర్శించిన పడవ పాయ దోసిందాకా ఊరుకోలేదు వాళ్లు గ్రహించుకుని, ఓపూట శ్రమపడి పడవ నడిపి వాటిని ఈ గట్టున దిగవిడిచి పోయారు.

ఎందుకోతులు ఇదంతా చూస్తూనే ఉన్నాయి. ఈమరిపని బాగానే ఉందనుకున్నాయి. కాని ఆచుట్టుపక్కల భూస్వాములు వీటిబాధ పడలేక వీటినికూడా వలలేసి పట్టి రెండుమూడు పడవలు ఇవతలగట్టుకి రవాణాచేశారు. అవి ఈఊరు రాగానే ఈఊరు కుర్రసమాజపు గౌరవకార్యదర్శికి వర్తమానం ముందట అందింది. ఆతడు తన సంఘంతోకూడా వెళ్లి, 'కోతీయ్! నీ ముక్కూనాముక్కూ దురద' అని ప్రతీదాన్నీ ఆహ్వానించాడట. అనగా గోక్కోడం అనేది నీకూ నాకూ సామాన్యధర్మం. మనిద్దరం ఒకటే-అని. తక్షణం ఈకుర్రాళ్లు లోగడ అనేకచోట్ల గెల్చిపొందిన అల్లరి 'షీల్డు' వెంటనే తమరేలాగేసేద్దాం అనా ఏమిటి దప్మా అనిపించేట్టు ఆ కోతులు ఇళ్ళన్నీ సోదాచేశాయి. వాటికి అవశ్యాహార మతం అవడంచేత కాయలూ పళ్లూ వాడుకున్నాయి. అవికూడా సంఘజీవులు గనక మనిషి ఒంటరిగా ఎక్కడేనా దొరికినప్పుడు మీద పడతాయి. ఈమధ్య ఒక ఇంగ్లీషు చదివిన ఆయన వాటిని కర్రతో బెదిరిస్తే, అవి తిరగబడేసరికి, ఆయన

వీరికి కండలేని మనిషి గనక చటాల్న ఇంటోకెళ్లి ఇంగ్లీషులో వాటిని కోప్పడుతూ ఫెడీమని తలుపు వేసుగుని కుర్చీ ముక్క-లయేటట్టు కూర్చున్నాడట. ఒక కొంటెపిల్లవాణ్ణి కూడా అవి గీకేశాయట. తమలో కొందరేనా అర్హులైనవాళ్లు ఉండక పోరు, వారిని ఏదో ఫీజుకి అప్రెంటిస్‌లుగా స్వీకరించి తగిన తరిఫీదు ఇప్పించవలసిందని, కుప్రసంఘం, మర్కటసంఘ గౌరవాధ్యక్షుడికి అర్జీ పంపినట్లు చాలామంది అనుకుంటున్నారు.

---

[మాటవరస (6)—1938
రాజమండ్రి
ఆర్ట్సు కాలేజీలో
27 _ 2 – 1938 తారీఖున
పూర్వ విద్యార్థి సంఘ వార్షికోత్సవ సందర్భములో
అధ్యక్షులైన
శ్రీ టంగుటూరి ప్రకాశం పంతులుగారి సమక్షంలో,
చదివిన మాటలు]

## ౧. భూమి యుద్ధాలు

భూమిమీద యుద్ధాలు జరుగుతూనే ఉన్నాయి. యుద్ధం అనేది ఎక్కడా కలికంలోకేనా లేకుండా రూపుమాపా లనే ఆదుర్దాలో గొప్పజాతులవాళ్లు యథాశక్తిగా వీలైనన్ని ఆయుధాలు తయారుచేసుకుంటున్నారు. యుద్ధాల్లో ప్రాచ్య యుద్ధాలూ, అప్రాచ్య యుద్ధాలూ కూడా లేకపోలేదు. ఆంగ్లే యులు ప్రతిచోటా గోడమీద పిల్లి వాటంగా ఉంటారని వదంతి. అదిగాక వారిలో వృద్ధజంబూకతుల్యులుగా ఉండే రాజ్యాంగ వేత్తలు చాలామంది ఉన్నారని పుకారు. అతి మధురంగా ఉండి ఇవతలవాణ్ణి బుటక వేయించే సమర్థింపు సమాధానాలు చెప్పడానికి వాళ్లకికి సాటిలేరు. ఇటీవల ఆబిస్సీనియా, స్పెయిన్, చీనా దేశాల్లో గదా యుద్ధాలు జరిగింది? వాటిని ఇంగ్లీషువారు ఎట్లా సమర్థించారో చూడండి. 'ఎబిస' అంటే ఇంగ్లీషులో అఖాతం అనే అర్థం ఉండడంచేతనున్నూ, తమరి కవి అయి

వున్న డాక్టర్ జాన్సన్‌గారు పూర్వకాలంలో 'రాసిలస్' అనే గ్రంథంలో అబిసీనియా వారిని గాలిలోంచి దిగి ఎవరో తంతారని జోశ్యం చెప్పిఉండడం చేతనన్నా అబిసీనియా పోయింది, మనం ఏంచేస్తాం అన్నారు. ఇక, స్పెయిన్ అనే మాటలో 'పెయిన్' అనగా బాధ రాసిపెట్టి ఉండడంవల్ల స్పెయిన్ దేశం బాధల్లో పడిపోయింది, ఎవరేం చెయ్యగల్రు, పొమ్మన్నారు. మరి, చీనా అంటే ఇంగ్లీషులో పింగాణీకి యాథ్యర్థం అవడంవల్ల ఆ దేశం ముక్కలుముక్కలు అయిపోతోంది. దేవుడు దిగొచ్చినా ఆ ముక్కలు అతుక్కోవు ఊరుకోండి అని అన్వయించి చెప్పేశారు. [ఈ రచన చేసిన కొన్నాళ్లకి జర్మనీ వారు ఆస్ట్రియాని ఆపోశనం పట్టారు. ఇదివరదాకా మింగుడుపడే దేశాలయొక్క ప్రారబ్ధం గురించి వాపోయే ఇంగ్లీషువారు ఈ మాటు మింగే దేశంయొక్క మహిమనే సమర్థించారు. 'జర్మ్' అంటే ఇంగ్లీషులో పురుగు గనుక, జర్మనీవారు తమ చుట్టు పక్క దేశాల్ని (అనగా, లోగడ రైన్‌లాండు నేడు ఆస్ట్రియా, రేపు సుముహూర్తం రాగానే జెకోస్లోవేకియా వగైరాలు) వేటినైనా సరే పురుగుపట్టినట్టుపట్టి కొట్టేస్తారు. మనం కళ్లప్పగించి చూస్తున్నా సరే, లేక ఒక వేళ దైవాద్యా కళ్లు నెప్పెట్టిన పక్షానికి మూసుకున్నా సరే నామర్దాగాని ప్రత్యవాయంగాని లేదని రాసిస్తాం అన్నారు.] కాని యుద్ధాల్ని ఆరికట్టడానికి నానాజాతిసమితి భూమిమీద కల్లా ఉత్కృష్టమైన సంఘం అని కొందరి ఊహ. అది ఉండబట్టే భూమిమీద ప్రజ ఇప్పటి

లాగ ఏదో ఒక మాదిరిగా నేనా మన్నగలుగుతున్నారు సయం కదూ అని వారనేది. ఇతరులు: అసలు ఈ నానాజాతిసమితి వల్లే యుద్ధాలు ఎక్కువయినాయి, బహుశా ఆ సమితికి తగని పని కలిపించడానికే యుద్ధాలు మరీ చెప్పినమాట వినకొచ్చి, వెనకటికంటె విస్తారంగానూ ఘోరతరంగానూ అవుతున్నాయని అంటారు. కొందరు: జాతులన్నీ శక్తివంతం అవుతున్నాయి. అంతకంటె ఎక్కువశక్తి ఉంటేనేగాని జాతుల్ని అంకెపెట్టగల సత్తా సమితికి ఉండదు. జాతులకి చతురంగ బలం ఉంటూన్నప్పుడు, వీళ్లని అదుపాజ్ఞల్లో ఉంచడానికి, జాతి సమితివారికి రెట్టికి రెట్టుగా అష్టాంగబలం గాని, తప్పితే పంచాంగబలంగాని ఉండాలి, జాతులకి వివవాయుబలం ఉంటే జాతిసమితివారికి విషాకాశబలం ఉండాలి. అటువంటి సాధనాలు ఈ సమితికి చేకూరడం అసంభవం అయి సమితివారు జాతులకి తత్త్వోపదేశం చెయ్యడం బరిమీదపడి దోచుకుపోయే రౌడీమీద పళ్లూడిన బామ్మగారి తొస్సిబెదిరింపులా ఉంటుందని, నమ్ముతారు. మనస్సులో ఊహ మంచిదైనా దండించే సత్తా తక్కువైనప్పుడు న్యాయ ప్రతిపాదన కల్లవార్త. అందుకని, వీరికి శాంతికి అప్పీలుగా ఒక చిన్న నానాగ్రహ సమితి ఏర్పాటయితే యుద్ధం అనేమాట లేకుండా చెయ్యవచ్చునని న్యాయప్రియులు పలుకుతూన్నారు. సమితిలో గ్రహాల్ని చేర్పడం మనం అనుకునేటంత కష్టం కాదని వీరి వాదన. ముందు చంద్రుడు. చంద్రుడి దగ్గిరికి 49 గంటల 24 నిమిషాల్లో

వెళ్లచ్చుట, వెళ్లి అక్కడ ఒక పార్లమెంటు స్థాపించవచ్చుట. అదివరకే అక్కడ ఏదేనా కాఫీహోటలుగాని ఉన్నట్టాయినా దాన్నే పార్లమెంటుగా ఒప్పించ వచ్చుట, తీరా చూసి అదే మిలిటరీహోటల్ అయితే అదే పార్లమెంటుగా ఒప్పుగోవచ్చుట. ఇల్లాకే, అంగారకుడు దగ్గిరికి వారంరోజుల్లో క్షేమంగా చేర వచ్చుననిన్నీ అక్కడ నీరు మువ్వాతికముప్వీసమున్నా నేల పాతిక వీసమున్నా అవడంచేత అంగారకజనం భూజనంకంటె అధమం నాలుగురెట్లు శారీకులూ బుద్ధిమంతులూ అయిఉంటారు గనక అంగారకుణ్ణి గ్రహసమితిలో చులాగ్గా చేర్పించవచ్చు ననిన్నీ, శుక్రుడికి ఒక కన్ను లేకపోవడంచేత అతణ్ణి ఒక పత్రా సికి లాక్కురావచ్చుననిన్నీ, సూర్యుడు దూరానికి దుర్నిరీ క్ష్యుడుగాని దగ్గిరకెడితే మనమాస్త్రరే అనిన్నీ, బుధుడుసూర్యు డికి కేవలం కలిపిగల సత్త్రకాయి గనక వాడి విషయంలో ఇట్టే యిబ్బంది ఉండదనిన్నీ, గురుడు వృద్ధమేష్టరున్నూ వట్టి నాయునా గనక పెండికట్లూ అతనూ మన్ని చూసే సరికే వాడిలి మన పక్షం చేరతాడనిన్నీ, సెలవిచ్చారు. ఇక ఒక్క శనిమాత్రం మిగిలిపోతాడు, వాడు కొంచెం పేచీలు పెట్టి సమితిలో చేర డేమో, 'ఏడెక్కడో శనిలాగ పోగయాడు రా మరీనూ' అని వాణ్ణి శనివిరగడ చేసుగునైనా సరే, భూమిమీద మరియుద్ధం అనేది రానీకుండా కట్టుదిట్టం చేస్తారని జ్ఞానులు ఊహిస్తున్నారు. ఇన్ని గ్రహాలయొక్క కూటమి జరిగినప్పుడు భూమి అనేదే ఐవూ ఆనవాలూ లేకుండా పోతుంది గనక, అప్పుడు జరిగే

భూమియుద్ధాలు నమేతూ దృష్టికి అందవు కాబట్టి వాటినిఅనతే జరగనివాటికింద కట్టుగోవచ్చు, ఆక్షేపణ లేదు, అని దైవజ్ఞులు కూడా పైమాట ఖాయపరుస్తున్నారు. ఆ్నుగహ సమితిలో ఉండతగ్గ ప్రాతినిధి ఏజాతి, ఏమతం, ఏభావ వాడు అయి ఉండాలో (పాతరాజులు తోసిరాజు లయూరు గనక) సిరంకుశ రాజుల దగ్గరనుంచి సిఫారసులు తీసుకుని సిద్ధంచేసి ఉంచడానికి ఒక ముక్కపరు కమీషను ఏర్పాటు చేస్తున్నారు. ఈకమిషనులో ఎవరెవరు ఉండాలి అనేదాన్ని గురించి ప్రస్తుతం దారుణం అయిన వాదోపవాదం జరుగుతోంది.

౨౦. మంత్రివర్గం.

ఎవరిపని మీద వారుంటారు. కాంగ్రెసు మంత్రులు ప్రతి రోజూ ఉదయాన్ని టెలిఫోనులో, "నేను ఈరోజు మంత్రినేనా" అని తమ పైవార్ని పిల్చి కనుక్కుని, ఆ తరవాతే కాగితాలు చూస్తూంటారని విటాం. ఈమధ్య బీహారు మంత్రుల రాజీనామా, పెనకటి భూకంపంలాగే వినబడింది. దాని దెబ్బ మద్రాసుకి కూడా తగులుతుందా అని కొందరికి ఊహకలిగింది. ఆసందర్భంలో తమరికి మంత్రిత్వం దొరుకుతుం దేమోనని కొందరు జాతకాలు పట్టిగెళ్లి జ్యోతిష్కులికి చూపించారు. వాళ్లు కాదేమో అనిచెప్పగా వాళ్లనికొట్టి వాళ్ళచేత అవచ్చు అనిపించుగున్నారు. కొందరు ఫొటో, టీపార్టీ, ప్రాణాయాయం

లేకుండా అవుట్లతో ఊరేగింపూ ఏర్పాటుచేసి, లోపాయికారీగా బజానాలు పారేసి ఒకవేళ తమకే మంత్రిత్వం గనక వస్తే ఏమేమి చెయ్యదల్చుకోవాలో దాని తాలూకు డ్రెస్ రిహార్సల్ వేసుకున్నారు మెమ్బర్లకి భయం పట్టుకుంది. ఈమధ్య కోట్లుఅక్కర్లేదు మామూలుగా మనిషి వెళ్లి పాఠం చెప్పినా తెలుస్తుంది. ఒకడు వేషం వేసుగుంటే ఇంకోడికి గౌరవాగౌరవాలు హెచ్చనూ హెచ్చవ్ తగ్గనూ తగ్గవ్ అని పైవారు ఒప్పుగున్నారు. అంచేత డబ్బులేని మెమ్బర్లు కూడా కోట్లాదిగా దానం చెయ్యడానికి తరుణం వచ్చింది. కాంగ్రెసు మంత్రివర్గం పోతుందేమో అని అనుమానం రాగానే మళ్లీ ఆదానం చేసిన కోట్లు ఎవళ్లికిచ్చేశారో కనుక్కుని, వాళ్ళకి వ్యయానికి ఇంకోచొప్పున ఇస్తాం అని చెప్పి వాళ్లు అవిలోగడ తొడుక్కున్నా. మరి ముందు తొడుక్కోవద్దు కేటాయింపుగా తమరు చెప్పే వరకూ ఉంచమన్నారట. ఈలోపుగా పైస్రాయిగారు ఋణ నివారణ అంగీకరిస్తారా లేదా, మద్రాసుకి, అన్నప్పుడు మరీ భయం చాలా ముంచికి వేసింది. ఇప్పుడిప్పుడు కొంచెం సర్దుకుంటున్నారు.

## 3. రైలు - బస్సు

రైలు రాక్షసవాహనం అని శ్రోత్రియుల నమ్మకం. అందుచేతనే అందులో వేసే బొగ్గుని 'రాక్షసి బొగ్గు' అంటారని వారి వాదం. బస్సుకూడా యమవాహనం అయిన దున్న యొక్క కోవకి చెందిన ఇనపజాతి అవడంవల్ల, రైలుకీ బస్సుకీ

ఎప్పుడూ సవితి పోరే. బస్సు గర్వం ఏమనంటే, తను గడప గడపకీ కూడా వెళ్ళగలనని! రైలు, అల్లా ఆ బిగించిన పట్టాల మీదా దేగాని, అవి దాటి ఇవతల కాలెట్టలేదు. ఆ పట్టాల గొడవ కాస్తా వొదిలిపోతే, ఎక్కడికి బడితే అక్కడికి రైళ్ళు కూడా వేంచేసి బస్సుని పాతిపెట్టేసి ఉండేవి. రైలు వాడికి ఈ విషయమైన యుద్ధపట్టుగుని బస్సులాంటి రైలుకారు వేశాడు; అద్దమైన చోట్లా ఆగడం సాగించాడు, తంటాలు పడుతున్నాడు గాని, పట్టాలు విసర్జించడానికి వీల్లేకొచ్చి ఇదవుతున్నాడు. బస్సువాళ్ళు బస్సుని పొడిగించి క్రమేపీ యాభైమందికీ వందమం దికీ, ప్రయాణ కాలంలో కూడా శుభాశుభాలకి అక్కరకొచ్చే రకంవి చెయిస్తారట. వీరి పోటీల్లో, ఉభయులూ రేట్లు తగ్గించుకోడం జరిగింది. కానైతే, ఎక్కిన వాళ్ళకి, ఇంకా అరిటి పళ్ళూ గట్రా ఎదురివ్వడం దాకా రాలేదు. ఇల్లాగ్గా రైలు వారూ బస్సువారూ అన్యోన్య వైషమ్యాలున్న వాళ్ళైనా, జనానికి పుణ్యం ఆర్జించుకునే మార్గాలు చూపెట్టడంలో సమానులు. రైలువాళ్ళు స్త్రీలనీ అంధుల్నీ చర్మరోగుల్నీ వికలాంగుల్నీ ఉచితంగా పంపించి, ప్రయాణీకులు స్వల్పదానంతో సశరీరంగా తరించే తరుణం కల్పించి పెడుతున్నారు. రైలులో సీజను టిక్కట్టుతో యాచించేవాళ్ళూ, రైలుపాస్తితో వడ్డీ వ్యాపారాల్లు చేసేవాళ్ళూ ఉన్నారు, నేను వాళ్ళతో ప్రసంగించాను. బస్సువారుకూడా సబురు ఒకటికి తల ఒకటికి ఒక కాని చొప్పున బలవంతంగా వసూలు చేసి, వద్దన్నా పుణ్యం ప్రయాణీ

కులకి కట్ట బెట్ట వలచి, వాళ్ళ శరీరాలు బస్మంలో బంధింప బడ్డా వాళ్ళ ఆత్మలకి మున్ముందు శాశ్వత బ్రహ్మలోక ప్రాప్తి సిద్ధించేలాగు, ఆ డబ్బుపెట్టి శ్రీరామనవమికి పందిళ్ళు కన్నుల వైకుంఠంగా వెయింది, అక్కడ మళ్ళీ జ్ఞానమూ మతమూ నత్తూ చిత్తూ అంటూ కూడోక అరతేటి వాళ్లు అప తను చేతనే లోగడ 'క్యాత్తు' పొంది శరిర సౌంధమూ స్వత్వకాల లయూగాల కళానిధుల్ని పురమాయించి, ఇవాం ఏమిటి పరమే గాని అప అడివాలో కబుర్లు చెబుతోచ్చిన పేదాంతులుకుడా పాడిఅన్నం తిని, వెళ్ళి, ప్రొద్దు కూకుటుండాని మేళం పంట్లో హాజరై పోట్టు చేసి, , సూత్స్యంలో మోక్షం కరతలా మలకం చేస్తున్నారు. రోడ్డు సుష్టుగా లేదని తెలిసీ కుడా కార్లని బస్సుల్ని సునోవేగంతో పోనిచ్చే పాలక వంఘుంలో పాటు బస్సు యజమానికీ చోదకుడికీకుడా, దాని గమనంవల్ల రేగిన దుమ్మువల్ల పుట్టే వ్యాధుల బాధ్యతలో పాటూ ఉండితీ రుతుండి. అంతకంటె ఎక్కువది బస్సువాడు ప్రజకి చేసే మేలు మరొకటి ఉంది. బస్తీలో గేదెలు అరుకు.పల్లెల్లో గేదెల్ని చెరువుల్లో కడుగుతారు. అవి అప్పుడే నీళ్లు ఆరగిస్తాయి. కాని, చెరువు ఖునం ఆట్టే సేపు ఉంచవు. బస్తీలో బస్సుల్ని కుళాయిల దగ్గిర కడుగుతారు. బస్సురోజాకి అధమం—తన్నై తేం ఇతరులు తొయ్యాడం వల్లనై తేం—యూభై మైళ్ళు నడుస్తుంది. సాధారణంగా రోడ్డుమీద నడుస్తుంది. కాని, చాలా గ్రామాల్లో బాహ్యార్థలంగా ప్రయోగవడే రోడ్ల పక్కల్నికుడా—

కుంటుంది. కొన్ని బస్సులు మంచి రకంవి కాకపోవడంచేత రాలవలసిన పరిమాణంలో దుమ్ము బురద ప్రతీ ఒక కుళాయి దగ్గిరా రాలక పోతుందేమో అనే దిగులు చొప్పున, ఒకే కుళాయి దగ్గిర నాలుగే సింటెక్స్ కూడా రోజుకి కడుతూండడం కద్దు. నగర పారిశుధ్యం ఇందుమూలాన్ని దళసరి అవుతుందని ఒప్పుకోని వాళ్ళు మందకొడిగా ఆలోచిస్తున్నారని చెప్పాలి.

## ౪. వార్త

తగుదుం అని తమరు వందలాదిగా జీతాలు పుచ్చుకుంటూ పెద్దలం మళ్ళీ మాట్లాడితే దారి చూపెట్టేవాళ్ళం అని పేరు పెట్టుకుని, కుమ్మక్కై నలుగురు గొప్పవాళ్ళు, ఒక యావత్తు సంసారాన్ని చటుక్కున లాక్కెళ్ళి తయారీ లేకుండా నోటీసు లేకుండా భర్తనీ భార్యనీ పిల్లల్నీ, పాపంగాని పుణ్యంగాని మరోటిగాని ఎరగని వాళ్ళని అమాంతంగా షూట్ చేసి, చక్కాపోయారట. మర్నాడు ఆ సంసారం వాళ్ళు తమకు పట్టిన పదవికి సంతోషించి, జనానికి టీపార్టీ ఇచ్చారట. చచ్చినవాళ్లు మళ్ళీ ఎల్లా బతికారా అని ఈ వార్త విన్న వాళ్లు కొందరు బాధపడగా, "ఒరే మీ అయిల్లు బంగారం గానూ, ఆ సంసారంవాళ్ళు చావలేదర్రా. వాళ్ళని 'షూట్' చేసింది ఒక సుప్రసిద్ధ ఫిల్ము కంపెనీవారు రా బాబూ! టాకీలలోకి వెళ్ళడానికి సజీవులైన వాళ్ళు ఎవళ్ళైనా సరిపోతార్రా! తక్కిన

వాళ్ళు కూడా పనికొస్తారు గాని స్థాపన, దహన, ఉద్బంధన క్రియల ధర్మమూ అని, ఆరకం దొరకదట్రా! అని గ్రహించుకున్న వాళ్ళు తెలియచెప్పారట!

## ౫౦. కల

ఒక ఊళ్ళో ఒక విద్యార్థికి ఈమధ్య ఒకనాటి రాత్రి కలొచ్చిందట. అందులో తనకి ప్రస్తుతం పాఠాలు చెబుతూన్న మేష్టర్లంతా ఒకేసారి గతించిపోయినట్లు అపిపించిందట. ఆసంగతి అతడు తన ముఖ్యస్నేహితుడితో ఒట్టేయించుకుని చెప్పాడు. వాడెళ్ళి మార్కులకోసం ఒక మేష్టరుతో ఊకాస్తా ఊదాడు. ఆమేష్టరు మొదటకుర్రాణ్ణి పిల్చి. 'ఏమోయ్, నేను పోయానన్నావుట గా!' అని అడిగాడు. 'నేను అల్లా చస్తే అన్లేదండి' అని కుర్రాడు మొరాయించాడు. 'పైగా, అబద్ధా లోటా?' అని కుర్రాణ్ణి మేష్టరు గదమాయించాడు. 'నేను మొత్తం మీాద చెప్పినప్పుడు మిమ్మల్ని ఒక్కర్నే అన్నట్టు మీారు దేవుళ్ళాడ్డం ఎందుకు?' అని కుర్రాడు అన్నాడు. వరసగా సంగతులు మోసే జనం అధికార్లకి ఈ జట్టీసంగతి మోసేశారు. ఆ మేష్టరు సజీవుడా నిర్జీవుడా అనే సంగతి తేల్చడానికి ఒక ఉపసంఘాన్ని వారు ఏర్పాటుచేశారు. మేష్టరు సంఘసభ్యుల్ని యథాశక్తిగా, వీలైతే వాళ్ళ ఇళ్ళకి కూడా వెళ్ళి దర్శించి, ఆశ్రయించి, తను బతికున్నట్టే వారు తీర్మానించేలాగు చూసు

గున్నాడు. ఈ సంగతి ఊరంతా పనగలిసిపోయింది. విద్యార్థులంతా ఆగ్రహించి, ఒక మేష్టరు మాత్రుడు తమసాటి విద్యార్థిని అనవసరంగా తూలనాడీ కూడా క్షమాపణ వేడుకోని కారణంచేత తమరికి పాఠాలమీాదా, సెలవుకాని రోజులమీాదా, మేష్టర్లమీాదా అనహ్యాంపుట్టి, సమ్మెకట్టి కట్టి రైల్లో వెళ్ళిపోయారు. చాలా గందరగోళంగా ఉంది. ఈసంగతి పైకి తంతికొట్టి, శ్రీ గిరిగారిని అక్కడికి రప్పిస్తారనిన్నీ, రాజీ కుదర వచ్చు ననిన్నీ అనుకుంటున్నారు.

---

## మాటవరస (7)—1943

[15-12-43 తేదీని రాజమండ్రీ ఆర్ట్సుకాలేజీ వర్ధంతిన్నీ, పూర్వ విద్యార్థిసంఘ వార్షికోత్సవమున్నూ జాయింటుగా కాలేజీలో జరిగిన సందర్భంలో, సాయంత్రసమావేశానికి అధ్యక్షులైన శ్రీ కొండి వేంకట రామమూర్తిగారి సమక్షంలో, కార్యక్రమం భారీగా ఉన్నప్పటికీ కాలయాపన నిమిత్తం నాకు ఇవ్వబడిన వ్యవధి పురస్కరించుకుని నేను ఈక్రింది రచనలో చాలాభాగం ఆపేశాను.]

(1) చాలామంది తెలుగువాళ్ళ నమ్మకప్రకారం పెద్ద దేవుడు ఒకడే. అంతవరకూ నయమే. కాని ఆ ఒక్కడూ సంస్కృత 'నేతి' పదార్థంతో ఘనశ్చరణచేసిన మీదట తయారవుతాడేకాని తెలుగుదినుసుకి అందడు. మరి ఆ ఒక్కడికీ తమన్ని సిఫార్సు చేసి పెట్టేందుకు తెలుగువాళ్ళు నియమించుకున్న చిల్లరదేవుళ్ళు ముక్కోటి. వాళ్ళల్లో ముఖ్యంగా ముగ్గురు ఎవరంటే, బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు! బ్రహ్మకి సంస్కృతమేకాని తెలుగు రాదుకదా! మహేశ్వరుడి వ్యాపారమే ఆఖరు మాటగనక అది తెలుగైతే, ఏమైతే! వారిలో తక్కిన విష్ణువు (బుక్కయినప్పుడు భాగవతటాకీల్లో వేషాలెయ్యడమేకాక) అవతారాలెత్తాడు. ఆ మొదటి నాలుగింటిల్లో ఏభాషా లేదు. వామనంలో పాతాళభాష. శ్రీరాముడికి జన్మతః హిందీ, వ్యవహారపరంగా అరవసింహళభాషలూ వచ్చుట! పరశురాముడికికూడా ఉత్తరాదిభాషేట. బలరామకృష్ణులకి గుజరాతీ, బుద్ధుడికి టిబెట్టు అనబడే త్రివిష్టపభాషా స్వంత

భాషలు. కలికి సంగతి ముందు తేలవలసిందిగనక, కలికి తెలుగు వస్తుందనుకోడానికి వీల్లేదు. సనకసనందనాదిమునులంతటికి పరావశ్యంతులేదు. తెలుగువాళ్ళ పూర్వ మతకర్తలైన శంకర, రామానుజ, మధ్వులవి ఆంధ్రేతరభాషలే. నేటికాలంలో కొన్నికొన్ని తెలుగుకుటుంబాలలో నవీనమతకర్తలుగా ఎంచబడే రామకృష్ణ, రధోస్వామి, హరనాథ్, సాయిబాబావంటి వాళ్ళది తెలుగుకాదు; వాళ్ళకి తెలుగురాదు. తెలుగులో 'చనినా రాయ్యరు చక్రవర్తులు'గదా అంటే వాళ్ళల్లో ఎవడూ తెలుగులో పుట్టనేలేదు. తెలుగు కవనం చెప్పిన కృష్ణరాయులవంటివాడికి వచ్చిన భాషలు గమనిస్తే అసలది మాతృభాష తెలుగే అని తేల్చడం కష్టం. తెలుగువాళ్ళ రాజుల్లోనూ రాజ్యాల్లోనూ చాలామంది తెలుగుని పోషించినా, దూరసంబంధబాంధవ్యాలు కలవాళ్ళవడంచేత, వాళ్ళల్లో పలువురికి తెలుగు రాదు; వచ్చినా లిపి తెలియదు; తెలిసినా అన్వయం చిక్కదు. తెలుగూ వచ్చి, తెలుగుపోషణా చేసినవాళ్ళు గుడుగుడుగుంచంలో పడ్డారు. నేటికీ గొప్ప తెలుగువాళ్ళు తెలుగు వచ్చినా వాడరు. తెలుగు వాడకుండా ఉంటేగాని తెలుగువాళ్ళచేత గొప్పవాళ్ళనిపించుకోలేరు. తెలుగుదేశం విడిచి అన్యత్రా వెళ్ళిన తెలుగువ్యక్తియొక్క గొప్పతనంగాని తెలుగువాళ్ళకి అన్తూండదు. వీటినిబట్టి చూడగా ఆరాధించడానికీ, పూజించడానికీ, మెచ్చడానికీ, నమస్కరించడానికీ, దాసోహం చెయ్యడానికీ, శిరసావహించడానికీ, విశ్వసించడానికీ, అంతర్యం

ఇవ్వడానికీ అంతులవాళ్ళు - దేవుళ్ళు, చిల్లర దేవుళ్ళు, ఋషులు, చిల్లర ఋషులు, మతకర్తలు, చిల్లర మతకర్తలు, పాలకులు, చిల్లర పాలకులు - యావద్విశిష్టమూ తెలుగు ప్రమేయం లేని వాళ్ళయితే తప్ప తెలుగుజనానికి మనస్సు స్తిమితపడదు గావును, హృదయం తృప్తిపడదు గావును అని తెలుస్తుంది. పై చెప్పిన మధ్యవర్తుల్లో ఎవరు తెలుగుబాధ అవగాహన చేసుకుని పెద్ద దేవుడికి సమర్పించి సిఫార్సుచేస్తారనో తెలుగువాళ్ళ ఉద్దేశం! తెలుగు తెలియని పై మధ్యవర్తుల ముఖతా పెద్ద దేవుడు తెలుగుక్షోభ ఇంతవరకు ఒక్కమాటైనా వినివుంటాడా అని! జాలి! చిత్రమవుతుంది. పైగా ఎప్పుడూ తెలుగురవళి విని ఉండకపోతే పెద్ద దేవుడికి ముందుముందు మనం తన తెలుగు తెలుస్తుందో ఇంజెక్షన్ ఇవ్వాలో! అదిసరి, కీడెంచి మేలెంచమన్నాడు - అసలు ఆ పెద్ద దేవుడికి తెలుగువచ్చునో, లేకపోతే తగిన తెలుగువాళ్ళెళ్ళి ఆయన్ని మొదట తెలుగుబళ్ళో పడేసి అథమం ఏ 'బేసిక్' తెలుగో సృష్టించి నేర్పి తరవాత తెలుగులో అతడితో వ్యవహరించాలో! ఏమో! తెలుగుగురించి పెద్ద దేవుడికి ఇంకా ఏం పాట్లు రాశాయో ఎవడెరుగును!

(2) ఒక తెలుగువాళ్ళ ఇడెన్ పార్టీలో ఇడెన్ యొక్క ప్రథమసృష్టికర్తలు అరవలా, ఆంధ్రులా అనే మీమాంస వచ్చింది. మూడువందల ఏళ్ళకిందటినించీ ఆ పేరు తెలుగులో ఉందని ఒక ఆంధ్రుడు ప్రమాణాలిచ్చాడు. కాని వస్తువ్యయం లేకుండా, నేవలికంగా ఇడెన్ చెయ్యడంలోని నేర్పూ, ఇడెన్‌కి

సాంబార్‌కీ ఉండే అన్యోన్యరసాయనిక మైత్రి అవిష్కరించడంలోని సూక్ష్మబుద్ధి కనపరచినవాళ్ళు అరవలేగనక అరవంలోంచే 'ఇడెన్' తెలుగులోకి వచ్చిఉంటుందని ఇంకోఆయన అన్నాడు. వయినం తేమల్లేదు. వాళ్ళిద్దరూ కేకలేసుగుని, తిట్టుగుని ఇడ్డెన్లు వుచ్చుగుని కొట్టుకున్నారు. తక్కినవాళ్ళు యథాశక్తిచొప్పున ఏమీ చెయ్యలేక నోరుతెరిచి మధ్య నుంచున్నారు. తరవాత ఒక చిన్న పార్లమెంటరీవాదన పూర్వ లిఖితం చేసి అక్షరాలా, ఒడుదుడుకుల్లేకుండా, కానిచ్చారు. అయినా కేసు పైసలుకాలేదు. ఆఖరికి, పోనీ గొప్పవాడుగదా, నేడో రేపో వృద్ధిలోకి రాబోతున్నాడు ఆ మాత్రం తెలిసుకుండా ఉంటాడా అనుకుని, లండన్‌లో మంత్రిగావున్న సర్ యాంటొనీ ఇడెన్‌గారికి రాసి ఈ సంగతి స్థిరపరచడానికి ఒప్పుగున్నారు. ఉభయపక్షాలకీ జయకరమైన సరియైన జవాబు ఆయన ఇవ్వకపోతే వెంటనే ఎంత ఖర్చైనాసరే ఈ విషయం యూడామ్‌కీ, ఈవ్‌కీ అప్పీలుచేస్తారని అనుకుంటున్నారు. కొన్ని కొన్ని విషయాల్లో ఆంధ్రులకి మా చెడ్డ పట్టుదల!

(3) ఈ మధ్య ఒక ముఖ్యపట్టణంలో నటనక్షత్రాల్నీ, రంగకారల్నీ పోగుచేసి సంగీతనాటకం ఆడిస్తానని ఒకరు పూచీపడి శపథంచేశారు. మొత్తం రు. 1500 నక్షత్రాలికి ఇవ్వడానికి ఒప్పుగుని ఉత్తరప్రత్యుత్తరాలు నడిపి, 15 రోజుల పూర్వంనించీ టిక్కెట్లు అమ్మించారు. ప్రదర్శనం తేదీనాటికి ఎనిమిది వందల రూపాయలు టిక్కెట్లు అమ్మకంవల్ల వచ్చే

నట్టూ, నక్షత్రాలకి సొమ్ము పూర్తిగా పంపకపోవడంవల్ల వాళ్ళు ఊళ్ళోకి రానట్టూ తెలిసి నాటక ప్రదర్శనం ఆగింది. టిక్కెట్లు కొనుక్కున్న జనం నిమిత్తం లేక వాళ్ళ ఎడల కోపం వహించి మోటైన తెలుగు వచనంలో ప్రతిజ్ఞలు చేశారు. ప్రదర్శనానికి రు. 1300 కొత్తపెట్టుబడితో మరో సుముహూర్తం పెట్టబడింది. టిక్కెట్లు కొనుక్కున్న వాళ్ళు క్రోధానికి కళ్లెం పెట్టి 'ఆలస్యం అయితే అయింది, ఏం చేస్తాం కర్మం' అనుకుని ఆగలేక, ప్రదర్శనశాలకి ఎగడ్డారు. ఆరోజుకి కూడా అనుకున్న నక్షత్రాల్లో ఒక నక్షత్రం కారణాంతరాలచేత రాక, అనుమతి లేకుండా తన పేరు అడ్వర్టయిజ్ చేసినందుకు పూచీదారుమీద డిఫమేషన్ వేస్తానని రాశారుకూడానూ! రాగనాటక సభ వాళ్ళు ఆశాభంగంవల్ల కోపం వెఱ్ఱెత్తిపోయి టిక్కెట్టుసొమ్ము వాపసు కోరారు. నాటక కళాస్వాదన సశాంతంగా, సక్రమంగా జరిగేటట్టు చెయ్యాలని వచ్చిన పోలీసులు పూచీదార్ని అరెస్టుచేసి నాటక రంగంమీదికి హాజరుపెట్టారు. పూచీదారు "డబ్బంటే వాపసు ఇచ్చెయ్యొచ్చుగాని, డబ్బు అయిపోయింది" అన్నారు. సభ వాళ్ళు అంతవరకే నాటకం చూసి వారి ఎంతో కోపం వచ్చి వెళ్ళిపోయారు. ఏవిధమైన హాని పూచీదారుకి కలగకుండా కాపాడి పోలీసులు పంపేశారు. టిక్కెట్లు కొనుక్కున్న వాళ్ళ కోపం ఇంకా పెరుగుతూనే ఉందనిన్నీ, ఆ కోపం రికార్డుచేయిస్తారనిన్నీ, అది ఎవరిమీద చూపెట్టాలో అనే సంగతి నిర్ణయించడానికి ఓ కోపకళాపరిషత్తు పెడతా

రనిన్నీ అనుకుంటున్నారు. మొత్తంమీద నలుగురి దగ్గిరా ఉండే సొమ్ము ఏకమై ఎవరిద్వారానో బ్యాంకులో పడడంవల్ల ఆ నగరంలో కొంత ఇన్ఫ్లేషన్ తగ్గిందనిన్నీ, అల్లాంటివి దేశో పకారమే అనిన్నీ ఆ సందర్భంలో టిక్కెట్టు కొనుక్కోనివాళ్ళంతా ఏకగ్రీవంగా తీర్మానించారు.

(4) ఆంధ్రులకి 'ఆదర్శం' 'పూర్ణం' అంటే ఇష్టం. ఏదైనా సరే, ఉంటే ఎల్లా ఉండాలీ అంటే ఆదర్శప్రాయంగా, పరి పూర్ణంగా ఉండాలి, లేకపోతే అస లుండకూడదు. పని ఏదైనా చేస్తే, ఎల్లాచెయ్యాలి! ఆదర్శంగా చెయ్యాలి. (అనగా ఏమిటేమిటో ఎవడూ, తనూ కూడా చెప్పడానికి వీల్లేనంత మహాదర్శంగా చెయ్యాలి) లేకపోతే!- లేకపోతే పని మానేసి, నోరుమూసుకుని వాజమ్మలా కూచోవాలి. సర్వసాధారణంగా ఈ రెండో మార్గం జరుగుతూంటుంది- అనగా శూన్యం! ఇదే ఆకాశం. అందుకనేగావును నేటి అధ్యక్షులైన తెలుగుఅధి కారి పృథివ్యాపస్తేజో వాయురాకాశాల లబ్ధిగురించి ఆలో చించి తెలుగుజాతికి ఆకాశపదార్థం సహజసమృద్ధిలో ఉండడం వల్ల మరి సప్లై చెయ్యవలసిన అవసరం లేదని గ్రహించుకుని, పృథివ్యాపస్సులు ఇప్పించడానికి ఏర్పాట్లు చేయిస్తూ తేజోవా యువులు వాడుకోడానికి సలహాలు ఇస్తూన్నారు. భూత పంచకాన్నీ, ఆంధ్రజాతినీ వీరు చాతుర్యంగా శోధించారు. "శాంతి శోధిస్తుంది" అని శాస్త్రంగదా!

(5) ఒక అబ్బాయికి జబ్బుచేసి, కాల్చే కాల్చే చుట్టంటే

జోకుపుట్టింది. ఆ జబ్బులో చుట్ట ముట్టేవాడు కాడు. మళ్ళీ అతడు చుట్ట కాల్చగలగడం అనేది రోగం మళ్ళిం దనడానికి సూచనగదా అనిగావును, వాళ్ళ నాన్న "మా వాడు మళ్ళీ హాయిగా ఎప్పుడు చుట్ట కాల్చుకుంటాడో గదా" అంటూ బెంగెట్టుగునేవాడు. అల్లాగే మేం చిరకాలం ఆంధ్ర పేపరుమిల్లు గొట్టం కేసి చూస్తూ "ఈ మర ఎప్పుడు ఆడి ఈ గొట్టంలోంచి ఎప్పుడు పొగ వస్తుందో కదా!" అని బెంగెట్టుగున్నాం! కొంత కాలానికి మిల్లు నిర్వహించడానికి ఆంధ్రేతరులు వచ్చింతరవాత అంతవనీ జరిగింది. ఆంధ్రంలో పని జరగడానికి ఉండవలిసిన ఒక లోటూ పూడింది, మరి ఆటంకాలు లేకుండా మర నడుస్తుంది అనుకున్నాం! కాని ఇంతట్లోనే మళ్ళీ ఆగిపోయి ఊరుకుంది. ఒక సైడిటుంది. తెలుగుగడ్డమీదకి బంగాలీ మరాటీ గుజరాతీవంటి ఏ ఆంధ్రేతరుడొచ్చినా కూడా పని ఇంతేగావును నిస్సందేహంగా అస్థలంలో ఏదో మాహాత్మ్యం ఉంది. లక్ష్మణుడు రాముడిమీద కేకలేసి తిట్టాడని గాథ చెప్పే స్థలం ఇదే అనో, దీనికి చాలా దగ్గరనో ఏదేనా శాసనం దొరుకుతుందేమో అనేటంతగా వచ్చింది వ్యవహారం!

(6) ఈ రాజమండ్రి కాలేజీ పూర్వ విద్యార్థి సంఘంలో చాలా మంది వృద్ధ పురుషులు ఉన్నారనే విచారమేనా లేకుండా, చిరకాలంనించి ఓల్డ్‌బోయిస్ ఎసోసియేషన్ అని ఉంటూండే పేరు పోగొట్టి ఈ సంఘానికి ఓల్డ్‌స్టూడెంట్స్ ఎసోసియేషన్ అనే మారుపేరు పెట్టించడానికి తగినకారణ భూతులైన సోదరీ

మణులు విద్యానంతరం ఆంధ్రగృహాభ్యుదయానికే కాక, ఆంధ్ర దేశాభివృద్ధికి కూడా తోడ్పడ గలందులకు తీర్మానించుకున్నారని తెలుస్తుంది.

(7) పురపాలకవర్గాన్ని చూస్తే కుచ్చటేసిపోతుంది. తమకి డబ్బు ముష్టివేసిన మహామహులకే తను ఓటు అనబడే మాన పత్రాన్ని అమ్ముకుని, పురమహాజనం పాలకవర్గ సభ్యుల్ని సృష్టించుకుంటారు. విశేష వ్యయంతో అటువంటి గౌరవ సభ్యత్వం ఆర్జించిన పాలకసభ్యులు స్వంత పెట్టుబడి సంగతిమరిచి పోవాలనిన్నీ, నిష్కామ కర్మ మాత్రమే చేస్తూ నిరంతరం జన సేవ సాగిస్తూ ఉండాలనిన్నీ పురజనంయొక్క తరవాత కోరి కలు! ఎక్కడ సాగుతాయా! ఆకళ్ళు కూడిస్తే కోరాను ణీలు పండుతాయా? దబ్బోసి సభ్యత్వం కొనుక్కోడం పెట్టి చెయ్యడానికి, పాట్టితిపడానికీనా! పెట్టుబళ్లేనా దక్కాలా! పుర జనానికుండే ఉమ్మడి ఆస్తులు బోలెడు: రోడ్లు తోటలు పందిళ్ళు భవనాలు వీధులు బజాళ్ళు ముఖ్యమైన భూమి-కాలవలుమురుగు కాలవలు చెరువులు నూతులు వగైరాలలోని జలం- ప్రాణం తీసే శత్రుత్వమేకాని స్నేహమ్మత్తులు లేని దీపాలు-వీటిల్లోంచి గుణవృద్ధిగా బయల్దేరే సువాసనతోనూ, దోమల్తోనూ ఉండే వాయువు - ఊరుదాటి కొంత మేరవరకూ కూడా ఆకాశం! ఇల్లాగా పంచభూతాత్మకం! ఇటువంటి ఉమ్మడి ఆస్తిని జనం తరఫున రక్షించి ఉద్ధరించడానికి డబ్బు కావలసిఉంటుంది గనక అది పురజనం దగ్గిర్నించి పన్నులరూపంగా వసూలు చెయ్యడపు విషయంలో పురపాలక వర్గంలో సభ్యులు ఒఖడా అన్నట్టు

కలిసి పోతారు.  ఇదితప్ప బహుశా అంతా కలిసే విషయం మరొకటి ఉండదు.  అక్కణ్ణుంచి నిష్కామకర్మలో చెయ్యవలసిన వ్యాయామం గురించి వర్గంలో పార్టీలు పుట్టడం, ఆపార్టీలు రెండుకంటే ఎక్కువ కాకుండా చెయ్యడానికి తడియత్నాలు జరగడం! కాని వాటిల్లో చిన్నపార్టీ ఏదో, పెద్దపార్టీ ఏదో తేల్చడానికి బ్రహ్మాశక్యం కాకుండా ఉండడం! ఎంచేతనంటే, చిన్నపార్టీలానే కనిపిస్తూ కన్ను మూసి తెరిచేవరకి అది ఆంజనేయులంతలాగ పెరిగిపోయి కనిపించడం, మరొకటి మంచి ముదిమిసిన పెద్ద పార్టీలాకే కనపడుతూ మనం ఇల్లావెళ్ళి ఇల్లా వచ్చేసరికి కల్యావశిష్టంగా కుమ్మించిపోడం జరుగుతూంటాయి! ఇక అంత చాంచల్యంగల పార్టీల్లోని సభ్యులు అదృష్టవశంచేత పురం పాలించడం ఎరగనివాళ్ళో, ఒకవేళ పురం పాలించడం అనేది విశ్వప్రయత్నంచేసి తెలుసుకున్నా ఆ ఒక్కటీమాత్రం ఎప్పుడుపడితే అప్పుడు చటుక్కున మరిచిపోగల ప్రజ్ఞ ఉన్నవాళ్ళో, తమరి హక్కుల్ని గురించిన నిబంధనలుమాత్రం బోధపడి తమ బాధ్యతల గురించిన నియమాలు అవగాహన కానివాళ్ళో, జబ్బపుష్టి శరీరదార్ఢ్యమూ కలిగి ఏదేనా కుర్చీలాంటిది ఎదటివాడిమీద విసరవలిసొచ్చినా, అవతలవాడు చిన్న కోసుబల్లలాంటిది తమమీద గిరవాటేసినప్పుడు కానుగోవలిసొచ్చినా సామర్థ్యం, నేర్పూ, సావధానం, నిస్పృహా కలవాళ్ళో అయినారా, పురజనానికి బొందెలోనే మోక్షం! ఒకే శరీరంయొక్క కాలు తలని తన్ని, నోరు

చేతిని కరిచి, వేలు కన్నాడిచి, చెయ్యి పొట్టని కుమ్మి వ్యవహారించేటప్పుడు ఆ శరీరాన్ని పాలించడం కష్టమూ, కష్టతరమూ! అల్లాగే పురపాలనకూడా చాలా కష్టం! పురం అంటే శరీరంకూడానూ!

(8) ఇది యంత్రయుగం. జీవితసౌకర్యాల నిమిత్తం దినదినమూ కూడా కనిపెట్టబడే యంత్రాలకి హద్దులేదు. ఎటొచ్చీ, అవన్నీ జనానికి అందుబాటులోకి వచ్చేసరికి ఆలస్యం అవుతూ ఉంటుంది అదికాక చంద్రుడియొక్క ప్రతిబింబం భూమిదగ్గిర్నుంచి ఇరవైనాలుగుమైళ్ళ దూరంలో మాత్రమే పడేటట్లు చెయ్యగల లెన్సు తయారుచెయ్యగలిగారు. ఆ లెన్సులో ఒకవేళ అంగారకుడులో జనం గనక ఉంటే, వాళ్ళుకూడా ప్రత్యక్షంగా మనికి కనపడిపోతారట! ఇక, నిజంగానే అంగారక జనం కలిపించారా, యూరప్, అమెరికాఖండాలవాళ్ళంతా వరిగట్టి అంగారకుడులో వలసరాజ్యాలు స్థాపించి, తప్పనిసరి అయితే యుద్ధాలు చేస్తారు. ఉన్నట్టు అల్లాంటివో సందులో కూడా మనకీమనకీ కొట్లాటలు కదరకపోదాన్నుంచి స్వరాజ్యం చేతిలో పడదు, పడినా మనవాడే మరోడు అది ఉన్నవాడి దగ్గర్నుంచి ఊడలాక్కుని పార్సెల్ కట్టి అంగారకుడిలోకి పంపించేస్తాడు. ఏ గ్రహాలు ఏమట ఆయేది యథాప్రకారాసికి లోటు లేకుండా మనకి తయారవుతుంది!—మరొకటి. ఆమధ్య ఆకాశం మీద ఎక్కడో తెల్లటి మచ్చలాంటిది ఒకటి గోచరించిందట. కొత్తగా తయారుచేసిన ఒక పెద్ద లెన్సుతో దాన్ని చూడగా

అందులో పదివేలకుపైగా నక్షత్రాలు ఉన్నట్టున్నూ, ఒక్కొ-క్కటి మన సూర్యుడికి ఓ వెయ్యిరెట్లు సైజులో ఉన్నట్టున్నూ తెలిసిందట. మన సూర్యుడికి నత్తరకాయ అయిన మన భూమి మీద ఉండే సభలికి ఎన్నుకోబడ్డ ఒక్కొక్క అధ్యక్షుడు మరి తనంతట తాను సృష్టిలో వేదనుకోవలిసిన అవసరం కనపడదు! కాని అనుకునేవాళ్లున్నారు!! మరో చిత్రమైన యంత్రం కని పెట్టారు. అది ఒక టోపీఆకారంలో ఉండే ఎలెక్ట్రిక్ యంత్రం! అది ధరించి విద్యార్థి క్లాసులో నిద్రపోవచ్చుట-కాదు, నిద్ర పోవాలిట! ఆ యంత్రం అప్పుడు జరిగే సంగతులన్నీ విద్యార్థి మెదడుకి బదలాయించి తాను లేవగానే ఆ సంగతులన్నీ వాడి స్మృతికి తెస్తుందట! ఆరీతిగా విద్యార్థియొక్క స్మృతిలోకి వచ్చిన సంగతులకి మరుపు అనేదే ఉండదుట! సరా:—అటువంటి టోపీమె నిద్రపోతూన్న మేష్టరుచేత చెప్తా రనుకున్న పాఠం చెప్పించగల యంత్రం వచ్చినా బాగానే ఉంటుంను గదా అని పరితపించే మేష్టర్లు ఉంటే ఉండవచ్చు. వాళ్లందరికీ ప్రస్తుతం అలాంటి యంత్రం రాలేదు కనక మన సానుభూతి. ఆ యంత్రంకూడా వస్తే వాళ్ళకి మన ధన్యవాదాలు!

(9) ఆరీతులైనవాళ్లకి పవిత్రాపవిత్రాలంటూ ఉండవు కాని, అల్పులకి ఉంటాయి. అందులోనూ కొందరు పవిత్రమని ఎంచే దాన్నే మరోకొందరు అల్పులు అపవిత్రం అని ఎంచడం దాం నార్లు జరుగుతూంటుంది. మనుష్యుల్తోపాటు భాషలూ అల్లానే అయినాయి, వాటికేమొచ్చిందో! చూడండి. 'పాక్'

అంటే ఒక భాషలో 'పవిత్రం', 'ఇస్తాన్' అంటే 'స్థానం' అని అర్థాలు! అటువంటి పవిత్రస్థానాన్ని ఆ భాషలో ఉచ్చారణ చెయ్యగానే మరో భాషలో అర్థం పవిత్రం కాకపోడం సరిగదా కేవలం అపవిత్రంగా కూడా ఉంటూండడం చాలా శోచనీయం. భాషల ఘోషవల్ల ఎన్ని మారాముళ్లనుకున్నారు, దిక్కు-మాలిన మారాముళ్లు!

(10) పరోక్ష సంగతి. ప్రస్తుతం యుద్ధం ఆగి, శాంతి సూర్యోదయం అవడానికి అరుణోదయం అయిందని యుద్ధ వేత్తలు సెలవిచ్చారు. యుద్ధం ఆగిపోడం మూడు మోస్తర్లగా—ఒకటి: ఒకరు కాళ్లు అప్పగించగా రెండోవాళ్ళు కాళ్ల బేరానికి రావడం! రెండు: కొట్టుకునేవాళ్ళకి విసిగెత్తిపోడం! లేక, మూడు: యుద్ధానికే విసిగెత్తి అది ఏ అంగారకుడులోకో లేచిపోడం! ఏ విషయంగానూ కూడా జోస్యం చెప్పడం కొంచెం ఇబ్బందే. అందులో ఏదేనా సంభవానికి ముందే స్పష్టార్థపదాల్లో జోస్యం చెప్పడం మరీ చిక్కు! అయినా సాహసించి ఇల్లా చెప్పవచ్చు: చాలాభాగం ఈ సిలాఖరుకో, ఇంకా ఏమున్న సశేషం ఉంటె వచ్చే ఏప్రిల్ నాటికో యుద్ధం ఫీదాగా ఆగిపోతుంది! "ఎల్లా చెప్పగలవ్? ఒకవేళ ఆగక-పోతే!" అని ఎవరికేనా సందేహం కలగవచ్చు. ఒకవేళ ఆగక-పోతే, పోనిండి, దాని మానాల దానికే ఉంటుంది! న్యాయాన్ని నయాన్ని చెప్తాం! కాళ్ళావేళ్ళా పడి బతిమాల్తాం! నోరూ వత్తీ బాదుకుని కేకలేస్తాం! "విమానం" రోజులు గనక